# ఈ మూడు సుగుణాలను ఇవ్వగలిగినది రూబీ డస్ట్ టీ మాత్రమే

1. తక్షణమే డికాక్షన్
2. నిండైన పరిమళం
3. ప్రతి పొట్లానికి ఎక్కువ కప్పుల టీ

RUBY DUST

చిక్కదనము మరియు పొదుపుతో కూడిన ఒకే ఒక్క టీ లిప్టన్ రూబీ డస్ట్.

లిప్టన్ రూబీ డస్ట్ – నిండైన కమ్మదనము మెండైన సువాసన కలిసి మెలిసే టీ

## లిప్టన్ రూబీ డస్ట్ ప్రతి ఒక్క ప్యాకెట్టుకు అధిక కప్పుల, రుచికరమైన టీని ఇస్తుంది



# ఆంధ్రసచిత్ర వారపత్రిక


వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 - 1972)

శుక్రవారం : 12–7–'74
శ్రీఆనందనామ సం. ఆషాఢమాస శు. సప్తమి
సంపుటము : 67 సంచిక 46

స్థాపితం : 1908
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-3.

సంవత్సర చందా – రు. 31–20 పై.
ఆరుమాసాల చందా – రు. 15–60 పై.
విడి ప్రతి వెల 55 పైసలు


## విషయసూచిక



శ్రీ లక్ష్మీనరసింహా ప్రొడక్షన్స్

# రాధమ్మ పెళ్లి

కథ-మాటలు-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం
దాసరి నారాయణరావు

నిర్మాతలు
మాపుళ్లయ్య, రామతారకం

అణుశక్తి ప్రయోగం.

ఇటీవల భారత్ జరిపిన అణుశక్తి ప్రయోగం వల్ల యితర దేశాలు వ్యక్తంచేసిన భయాలకు, విభిన్న అభిప్రాయాలకు నవ్వు వస్తోంది ముఖ్యంగా భుట్టోకి కలిగిన ఆందోళన హాస్యాస్పదంగానే ఉంది ఒకవిధంగా ఆలోచిస్తే, భారత్‌వంటి వర్ధమాన దేశం అణ్వస్త్రాల విషయంలో కూడ ముందంజ వెయ్యాలి అప్పుడే యితరులకి మనమంటే అదురు బెదురు కలుగుతాయి లేకపోతే, పాకిస్తాన్ వంటి పిల్లకాకులుకూడా యుద్ధం, చైనావంటి దెయ్యాలు మధ్య మధ్య కుప్పిగంతులు వెయ్యటం వంటి చికాకులు తప్పవు భారత్ ఎప్పుడూ శాంతినే కాంక్షిస్తుంది ఈ విషయంలో జపాన్‌వంటి దేశాలు ఆందోళన చెందవలసిన పని లేదు

ఏ ఎస్ చక్రవర్తి (హైదరాబాద్)

* * *

7—6—74 తేది సంచికలో వారణాసి నుండి శ్రీ కల్లూరి వాసుదేవరావుగారు వ్రాసిన జాబును చూచిన వెంటనే ఈ ఉత్తరం రాయాలనిపించింది

మనమంతా ఈ భారత దేశంలో జన్మించాము మనలో ఉత్తరాది వారని, దక్షిణాదివారని వేరు వేరుగా భావించడం దేశ సమగ్రతకు గొడ్డలిపెట్టు ఈ విధంగా భావించే వారి సంఖ్య పెరగటంవల్ల దేశ సమైక్యతకు భంగము వాటిల్లే పరిస్థితి ఏర్పడవచ్చు

పరిశ్రమలు గాని, విశ్వవిద్యాలయాలు కాని దేశములో ఎక్కడ స్థాపించినా అవి మన దేశంలోనే ఉంటాయి గాని బయటికి పోవు అవిమన దేశ అర్థికాభివృద్ధికి తోడ్పడతాయి.

దక్షిణాది రాష్ట్రాలు వెనుకబడివున్నవని నేనూ అంగీకరిస్తాను కాని మన దృక్పథం వ్యతిరేకాత్మకంగా ఉండరాదు అందువలన అతను ఈ విషయాన్ని గమనిస్తారని ఆశిస్తాను ఈ దేశ అఖండత్వాన్ని అమరత్వాన్ని కాపాడగలరని కోరుతాను

ఎం శ్రీ శ్రీధర్ (హిందూపురం)

మినీ ఇంటర్వ్యూ

గీతా ఫీచర్స్ "మినీ ఇంటర్వ్యూ"లలో ఆడపిల్లల గూర్చే ఎక్కువగా ప్రస్తావన వస్తున్నది ఆడపిల్లలంటే నాకు గిట్టదు అడ పిల్లలను ఏడిపిస్తుంటాను అనే అసభ్యకరమైన అభిప్రాయలను ప్రచురించకుండా, ఆదర్శవంతమైన యువకులకు "మినీ ఇంటర్వ్యూ"లో స్థానం కల్పిస్తే చాల మంచిది

బోనాల మోహన్‌రావు (మిర్యాలగూడ)

"తెలుగోడి గోడు"

"తెలుగోడిగోడు" లాంటి చక్కని శీర్షిక ప్రచురిస్తున్న మీరు రెండు వారాలకు ఒకసారి హిందీవంటి మణుల ముఖచిత్రం ప్రచురిస్తున్నారు మీరు కూడా తెలుగు వారని చక్కగా నిరూపించుకున్నారు ఈ గోడును ప్రచురించక పోయినా ఫరవాలేదు

మల్లెం విజయకుమార్, (మద్రాస్)

**మన లో మా ట**

'స్లీపింగ్ గెస్ట్' (8-2-'74 సంచిక) పెద్ద కథతో ఆంధ్ర పత్రిక వారపత్రిక పాఠకులను ఆకట్టుకున్న కుమారి ఆలేటి నాగమణి రచన 'అన్నపూర్ణ'



యీ వారం నుంచీ ప్రారంభమైంది రచయిత్రి చాలా చిన్నప్పట్నుంచే రచనా వ్యాసంగం ప్రారంభించి నాలుగు పదులు దాకా కథలను వివిధ పత్రికలలో ప్రచురించారు ఇప్పుడామె వయస్సు 22 సంవత్సరాలు అన్నపూర్ణ తొలి నవల హైదరాబాద్‌లో పుట్టి పెరిగిన యీమె, ప్రయివేటుగా బి ఏ పరీక్ష కట్టి ఉత్తీర్ణురాలై అక్కడే ఉద్యోగం కూడా చేస్తున్నారు

* * *

కొన్ని వారాలుగా కనుపించని "పాలాకుడు" సుప్రసిద్ధ వ్యంగ్య చిత్రకారుడు 'సెంబు'పాయింతో — యీ వారం తిరిగి ప్రదర్శనమిస్తున్నాడు.

మన భారత భూమి అనేక ప్రదేశాలుగా విభజింపబడినది. ఒకప్పుడు యాభై యారు ప్రాంతాలు — అంగ — వంగ — కళింగాదులుగా చెప్పబడింది. వేద విహితాలయిన కర్మలు చేసేటప్పుడు "భారతవర్షే భారత ఖండే" అని సంకల్పం చెప్పుకుంటున్నారు ఆ భారతవర్షం ఏమిటో తెలిసినవారు తక్కువగానే ఉంటారు

'వర్షం' అంటే వాన, సంవత్సరం మొదలైన అర్థాలే కాకుండా భూమియొక్క విభాగమనికూడా అర్థమున్నది. మన ప్రాచీనులు భూమండలాన్ని తొమ్మిది వర్షములుగా




విభజించారు అవి—భారతవర్షం, కింపురుష వర్షం, హరివర్షం, రమ్యకవర్షం, హిరణ్మయ వర్షం, కురువర్షం, భద్రాశ్వవర్షం, కేతుమాలవర్షం, ఇలావృతవర్షం—అనేవి

వాటి వివరణ ఈ శ్లోకాలలో ఉన్నది—

'స్యాద్భారతం కింపురుషం
హరివర్షం చ దక్షిణాః
రమ్యం హిరణ్మయం కురూ
సుమేరో రుత్తరా స్త్రయః
భద్రాశ్వకేతుమాలౌ తు
ద్వే వర్షే పూర్వపశ్చిమే,
ఇలావృతం తు మధ్యస్థం
సుమేరు ర్యత్ర తిష్ఠతి"

సుమేరుపర్వతంమధ్య ప్రదేశంలోఉంటున్నది. దానికి దక్షిణంగా భారతవర్షం, కింపురుష వర్షం, హరివర్షం అనేవి మూడూ ఉన్నవి

సుమేరువునకు ఉత్తరంగా రమ్యకవర్షం, హిరణ్మయవర్షం,కురువర్షం అనే మూడున్నూ ఉంటున్నవి

దానికి తూర్పుదిక్కున భద్రాశ్వవర్షమూ, పడమటితట్టున కేతుమాలవర్షమూ ఉన్నాయి

ఇక మిగిలినది ఒక్క ఇలావృతవర్షం అది సుమేరువు వుండే చోటున ఉన్నదే! అంటే సుమేరుపర్వతం ఇలావృతవర్షంలోనే ఉన్నదన్నమాట

అయితే ఆ సుమేరువు ఇప్పుడు ఎక్కడ ఏ పేరుతో ఉన్నదో, తెలసుకు నే—ఏ వర్షం ఎక్కడ వుండినదీ గ్రహించవచ్చును.

## హైదరాబాద్ నోట్ బుక్ —తిరుమల రామచంద్ర

### ఏడుకొండలవాని లడ్డు!

"హరీ! రామచంద్రా! ఇగ పట్టు తిరుపతి ప్రసాదం లడ్డు" అంటూ నా మిత్రుడు లక్ష్మణ శాస్త్రి ఒక కాయితంలో చుట్టిన ఉండను చేతి కందించాడు. విప్పి చూస్తే అది హాకీ బంతి వలె కనిపించింది. "సరే కొంచెం తుంచు. ఇద్దరం ప్రసాదం తీసుకుందాం" అని అన్నాడు మిత్రుడు. తుంచబోయాను. తునగలేదు. "చక్కా చిక్కిన వాడివి. నువ్వేం తుంచుతావ్? ఇటు తే" అంటూ నానుంచి లాక్కొని తుంచబోయాడు. ఒక్క ముక్కకూడా పెగలలేదు. చుట్టుప్రక్కల సాధనాల కోసం చూశాము. అవి కొత్త రకం ఇండ్లు. అన్నీ మెషిన్‌తో తయారవుతున్నాయి. దంచడానికి మెషిన్, వేయించడానికి మెషిను. ప్రతిదానికి మిషనే. కనుక దాన్ని పగులగొట్టే సాధనం నాకేదీ దొరకలేదు. ఇల్లంతా వెదకగా వెదకగా ఒక పాడుంగి కొడితె కనిపించింది. కొడితె అంటే ఉలిప్పైన కొట్టే కఱ్ఱ మొద్దు. దాంతో రెండు బాదులు బాదాను. ఒక చెక్క పెగిలింది. "స్వామి నీ ప్రసాదం ఇంతే చాలు" అని ఆ చెక్కలో నా మిత్రునికో సగం, నాకో సగం అనుకుంటూ నోట్లో వేసుకున్నాను. అది లడ్డు కాదు. పప్పి సెనగ పున్నీ ఉండ. "రామచంద్రా! పదేండ్లు మనం తిరుపతిలో ఉన్నాము. బ్రహ్మాండమైన లడ్లు తిన్నాము. మనకు తెలిదా? చేసినవాళ్లకు తెలిదా?" అన్నాడు నా మిత్రుడు. నేనన్నాను— "లడ్డు రెండు వేల సంవత్సరాల ముందు నుంచి మనకు తెలుసు. గాథాసప్తశతిలో 'ఆ శేఖ్య లడ్డుకం' గురించి ఉంది. ఒక యువతి ఒక యువకునితో అంటుంది. 'హాయ్ వెర్రి నాగన్నా! నీవు బొమ్మలో చేసిన లడ్డు చూసి సంతోషిస్తావుగాని, అసలు లడ్డు రుచి నీకు తెలిదు' అని, ఆట్లాగే లక్షపై వర్ణనలో లడ్డుతో అవయవాలను పోల్చడం ఉంది కానీ లడ్లు ఎట్లా చేసేవాళ్లో తెలిదు. "భోజన కుతూహలం'లో మాత్రం లడ్డు తయారీ, పెండలైన వివరాలు ఉన్నట్లు విన్నాను. మన చిన్ననాడు అంటే యాభయి ఏండ్ల క్రితం తిరుమలపైన ప్రసాదం లడ్లు ఎట్లుండేవో, తెలుసుగదా! మధురం వసుపురంగు బూందీలు, వేయించిన మధురం పలుకు ద్రాక్ష, సారపప్పు, చిన్న కలకండ ముక్కలు, కుంకుమపూవు ముక్కలు, సమభాగాలుగా కట్టిన పచ్చబేసి ఆ లడ్లు రత్నాల బంతుల్లాగా కనిపించేవి. ఇదేమి లడ్డోయ్ సెనగ పున్ని ఉండగాని!" అన్నాను. "సరే, భగవత్ప్రసాదం, ఏమీ అనవద్దు" అని మిత్రుడు హెచ్చరించాడు. సరేనని ఊరుకున్నాను.

### ఫ్లయింగ్ స్క్వాడ్స్!

"ఈ ఫ్లయింగ్ స్క్వాడ్స్ అనే పదం ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో పుట్టింది. దాన్ని, ఆ స్క్వాడ్‌నూ అనాయాసంగా మన పరీక్షాధికారులు యిప్పుడు ప్రయోగిస్తున్నారు. మేం పరీక్ష రాసేటప్పుడు అడగకుండా అకస్మాత్తుగా వచ్చి రాసేవాళ్లకు ఇట్లా విఘ్నం కలిగించకపోతే ఏం పోయింది?" అని ఒక విద్యార్థి నాయుడు నాతో అన్నాడు. "ఫ్యాక్టరీలలో కార్మికులను పోద్దా

---

## కొత్త ఫైళ్లలో—— ఒక గుమాస్తాగారి డైరీలో ఒక పేజీ

—తాటవర్తి

గం. 10–15 ఆఫీసులో అడుగు పెట్టుట. (సిన్సియారిటీ)

10–15 నుంచి 10–30 సిటీ బస్సులో పడిన హైరానకు ప్రతిగా విశ్రాంతి (ఆవశ్యకత.)

10–30 నుంచి 10–40 అప్పుడప్పుడే ఆఫీసుకి వచ్చే వారితో గుడ్‌మార్నింగులు—పలకరింపులు. (సామాజిక ధర్మము)

10–40 నుంచి 11–00 తాజావార్తలపై సహోద్యోగులతో ముచ్చట్లు (నాగరికత)

11–00 నుంచి 11–15 నేడుచూడవల్సిన ఫైళ్ళు తీసి విడిగా పెట్టుట. (ఫస్టు డ్యూటీ)

11–15 నుంచి 11–30 కాంటీన్‌లో టీ—పరిచయస్తుల పలకరింపుల మధ్య సిగరెట్టు కాల్చుట (ఫ్రెష్‌గా ఉండటానికి షార్ట్ రిలీవ్)

11–30నుంచి 11–45 బాస్ పిలుపు—ఫలానా ఫైలు గురించి అడిగినప్పైనం—వెతికి పంపుట. (తృప్తికరమైన డ్యూటీ)

11–45 నుంచి 11–55 ఆ పనివల్ల కల్గిన శ్రమకు భర్తీగా చిన్న విశ్రాంతి. (తప్పనిసరి !)

11–55నుంచి 12–00 ఫైలు తెరచి సంగతులు చదవబోవుట (డ్యూటీలో ఒకభాగం)

12–00 నుంచి 12–15 ప్రక్క సెక్షన్ నుంచి వచ్చిన కొల్లీగ్స్ సందేహ నివృత్తి. (వ్యక్తి ధర్మము)

12–15 నుంచి 12–30 గతదినం టైపు చేయించి బాస్ సంతకానికి పంపిన కాగితాలు తిరిగివస్తే వాటిని డిస్పాచ్‌కి పంపుట. (మినీ డ్యూటీ.)

12–30 నుంచి 12–40 వరండాలోకి పోయి మరో సిగరెట్టు పనిచేయుట, (విధిమధ్య వదల్చుకుని షార్ట్ రిలీఫ్)

12–40 నుంచి 1–00 తెరచి ఉన్న ఫైలుకి వ్రాయవల్సిన జవాబు గురించి ఆలోచించుట—పాత ఫైలు తిరగవేయుట. (డ్యూటీలో అంతర్భాగం)

1–00 నుంచి 1–10 బాస్ నుంచి పిలుపు—ఫైలు ఏమయిందని. అదేమాస్తున్నపైనం తెలియజేసి తిరిగివచ్చుట — టైము చూస్తే లంచివేళ సమీపించుట గుర్తించుట. (సమయస్ఫూర్తి—అప్రమత్తత)

1–10 నుంచి 1–30 ప్రక్క సీటు 'మెహతా' క్రొత్త షర్టు కొన్న వివరాలు—ఖరీదు, కంపెనీ, షాపు—మొదలైనవి సేకరించుట. కొనబోయే షర్టు గురించి ఊహాగానాలు చేయుట. (ప్రభుత్వోద్యోగికి నిత్య నూతనోత్సాహానికి మార్గం)

1–30 నుంచి 2–30 లంచివేళ. సహోద్యోగులతో దేశ సమస్యల గురించి టాక్సు. (లాంగ్ రిలీఫ్‌తో పౌర ధర్మము.)



చేసినట్లు మేమూ పరీక్ష హాలులోనికి ప్రవేశిస్తున్నప్పుడే సోదా చేయండి అంతేగాని అడుగడుగుకూ మా రొమ్ములపైన తడమడం, మా కొంటెలో చెయ్యి దూర్చడం ఏం ఉచితం ?" మరొక విద్యార్థి నాయకుడన్నాడు. "ఈ ఫ్లైయింగ్ స్క్వాడ్‌లను తిరుపతిలో జరిగే ప్రసాదం బ్లాక్ మార్కెటింగ్‌పైన ప్రయోగించండి సార్ ! మరో లంచగొండి శాఖలపైన ప్రయోగించండి సార్ ! మాపైనెందుకూ ?" అన్నాడొక విద్యార్థి నాతో. నేనన్నానుగదా . . ఇదేమండీ ఇలా అంటారు ? మీరే గదా భావి పౌరులు ! ఇప్పట్నుంచి మీరు క్రమశిక్షణ అలవరచుకోకపోతే ఉత్తరోత్తరా మీరు చేసే ఉద్యోగాల్లోనూ న్యాయ దృష్టి కొరవడుతుందికదా !" ఆ విద్యార్థి వినయంగా "పంతులుగారూ, బాగానే చెప్పారు. భవిష్యత్సంపద అంతా మాదే ఆ సంపదను మేము అనుభవించడానికి మీరిచ్చిన శిక్షణ ఏమిటండీ మాకు ? పాఠశాలల్లో చేరడం ఒక సమస్య, ఉపన్యాసకులకు పాఠాలు చెప్పడంకంటే వాళ్ళ జీతాలూ, వాళ్ల హోదాలూ చూసుకున్న తరువాత మిగతా సమయంలో మాకు చదువు. పరీక్ష సమస్యా, పరీక్షలో తమ తమ యిష్టులైన వాళ్ళకు ఇన్విజిలేటర్లు, లెక్చరర్లు, సూచనలు చేస్తూనే ఉండిరి. ఇంకా కొంత ధైర్యశాలురు ప్లాట్‌ఫారమ్ ఎక్కి డిక్టేషన్ చెబుతుండిరి పరీక్షలలో. చదువు చెప్పడం ముఖ్యంకాక కులమత, ప్రాంత భేదాలతో వర్గాలు సృష్టిస్తూనే ఉండిరి అందుకోసమే మా భవిష్యత్తు మేము చూసుకోవలసి వచ్చింది !" అన్నాడు.

కాగితం కరువు :

అన్ని కరువులూ ఒక ఎత్తయితే, కాయితం కరువు మరొక ఎత్తయింది. "నాన్నా, అన్నిటికీ నోట్సుకావాలంటు, లేనగిన తేకపోతివో, మంచి గుండదు, అని మా పంత్వంగారన్నారు"! అనేమాటలు ఇంటింటా మంత్రజపంలా మార్మోగుతున్నాయి. ఎగువసభ సభ్యులు శ్రీ ఎల్. గిరిధరరావు అన్నట్లు ఒక క్వైరు తెల్ల కాయితాలు 1973 లో 65 పైసలయితే, ఇప్పుడు రూపాయిన్నర. 75 పైసల లెక్కల నోటుబుక్కు ఇప్పుడు రూపాయిముప్పావలా. ఇక రచయిత అయినవాడు తన పుస్తకం ముద్రించుకొందామంటే, 38 రూపాయలమ్మిన డబుల్ డెమ్మీ తెల్లకాయితం రీము ఇప్పుడు 90 రూపాయలమ్ముతుంది. తాటాకులనో, కడితాలనో, కొండపల్లి పేపరు కాయితాలనో, భూర్జపత్రాలనో వాడుదామన్నా, యుద్ధ కాలంలో గుండు సూదులకు నూరుతున్నట్టు ముండ్లను వాడినట్టు— అనుకుంటే, సద్యః స్వాతమేకాక, అనభ్యాసమూ అడ్డు తగులుతూంది. తక్కిన సమస్యల్లాగే దీనినీ కాలప్రవాహానికి వదలడమే మధ్యతరగతి మందమతి, బృందగతి చేయవలసింది.

ఉపశ్రుతి :

"ఇల్లలికినంతనే పండుగ కాదు
పులిహోర వండినంతనే పిండివంటకాదు"

ఇది మనకు వాలాకాలంగా వస్తున్న సామెత.

దీనికి సరికొత్త పాఠాంతరం:

"ఇల్లు అలుకగానే పండుగకాదు
తిరుపతి నుండి రాగానే లడ్డు కాదు"

2–30 నుంచి 2–45 తిరిగి వచ్చి సీటులో పాన్ నములుతూ రెస్టు తీసుకొనుట. (భుక్తాయాసము-శారీరికధర్మము)

2–45 నుంచి 3–05 ఉదయం తెలిసిన ఫైలుకు సంబంధించిన డ్రాఫ్టు తయారు చేయుట (నిక్కచ్చైన డ్యూటీ)

3–05 నుంచి 3–10 వరండాలోకి పోయి ఇంకొక సిగరెట్టు నుసి చేయుట — బయట లాన్సులో పేకాట మంచి పసందుగా నడుచు దృశ్యము కళ్ల బడుట. (ఉత్తేజకరమైన షార్టు రిలీఫ్.)

3–10 నుంచి 3–40 పేకాట వారి చేతుల్లోని ముక్కలు చూస్తూ ఉద్రేకపడుట —గుండెల్లోని కోర్కెను చంపుకొనుట. (బలహీనతను జయించుట !)

3–40 నుంచి 3–50 కాంటీన్‌కిపోయి టీ త్రాగి వచ్చుట. (క్రొత్త సత్తువ చేకూర్చే షార్టురిలీఫ్.)

3–50 నుంచి 3–55 బాస్ దగ్గరకి సంతకానికి వెళ్లిన ఫైలుని టైపిస్టుకి పంపుట. (ఇదీ డ్యూటీయే మరి !)

3-55 నుంచి 4–15 ఇన్వర్డ్ డాక్ పరిశీలించి వచ్చిన లెటర్సు ఓసారి చదివి పెండింగ్ ఫైలులో చేర్చుట. (వాయిదా పడిన డ్యూటీ)

4–15 నుంచి 4–45 కో-ఆపరేటివ్ స్టోర్సుకి పోయి కావల్సిన సరకులు కొని తెచ్చుకొనుట—(స్టోర్సు 5 గంటలకి మూసివేస్తారు మరి!)—(కుటుంబ ధర్మము.)

4–45 నుంచి 5–00 ఫైళ్లన్నీ సర్ది ప్రక్కగా పెట్టుట. (డ్యూటీలో అంతిమ భాగం.)

5–00 నుంచి 5–15 విశ్రాంతి. (బస్సు ఎక్కటానికి కావల్సిన శక్తిని అడ్వాన్సుగా చేకూర్చుకొనుట.)

5–15 బస్సుస్టాపు వైపు పరుగు

గమనికలు :

1. బాస్‌కి పుటప్ చేసిన ఫైలు కాని, డిస్పాచ్‌కి వెళ్లిన లెటర్స్‌కాని—ఇవి రెగ్యులర్‌గా ఆయన పనిచేయటం వల్ల వెళ్లలేదు—నాల్గవ రిమైండరు రావటం చూచి బాస్ వత్తిడి చేస్తే—వెళ్లిన బాపతువి.

2. ఎన్ని రిమైండర్లు వచ్చినా ఫైల్సు కదపని మహాత్ముల దినచర్య కాదిది. (వారి డైరీలో ఒకటే వాక్యం ఉంటుంది. కాంటీన్‌లో కాలక్షేపం మరియు లాన్స్‌లో చతుర్ముఖ పారాయణం) — కొంచెం మంచి (అంటే సిన్సియర్,)గుమాస్తాగారి డైరీ ఇది.

3. మరి ఇలా అయితే ఆ వచ్చే లెటర్సన్నీ ఎప్పటికి పూర్తయ్యేను? వెళ్ళాల్సిన వంటూ ఇకలేవా?—అని మీరు అడగాలనుకుంటున్నారా? అది తెలియకనే బాబూ ఈ డైరీ మీ ముందు పెడుతున్నాను...ఈ దేశంలో ఈ సమస్యను పరిష్కరించే వారున్నారా అని ?!




ఉపశ్రుతి :

అయితే ఇంత వివరంగా తుచ తప్పకుండా ఓ మంచి గుమాస్తా గారి దినచర్య వ్రాసిన ... మీరెవరు మహాశయా—అని అడగాలనుకుంటున్నారా?—బాబోయ్! నేను చెప్పను. నన్ను కూడ ఇంత మంచి గుమాస్తాగా మారమని మాబాస్ అంటే! ఇంకేముంది—నా కొంప మునిగిపోదూ!...

## డాక్టర్ సలహాలు

డా. కె. వెంకటేశ్వరరావు

**బి. వి. ఎస్. ఎస్. రాజమండ్రి.**

పురుషులకు చేసే 'వేసెక్టమీ' ఆపరేషన్ వాస్ డిఫరెన్స్ నుంచి స్పెర్మ్సు బయటకి రాకుండా చేయటమేనా ? ఒకసారి ఆపరేషన్ చేయించు కొన్న తర్వాత తిరిగి పిల్లలు పుట్టేలా చేసుకొన వచ్చునా ?

'స్పెర్మ్' పయనించే మార్గంలో అవరోధం ఏర్పరచటం—వేసెక్టమీ యొక్క ధ్యేయము అవ రోధం మాత్రమే గాక ఒక అంగుళం మేరకు వాస్ డిఫరెన్స్‌ను తీసివేయటం జరుగుతుంది ఎందు కంటే నిరంతరంగా అవరోధమేర్పరచటానికి

తిరిగి పిల్లలు కావలసి వస్తే చాలా కేంద్రా ల్లో 'రీకెనలైజేషన్' అనే ఆపరేషన్ చేసి తిరిగి మార్గమేర్పరుస్తారు.

**వి. ఎల్. గుంటూరు—2.**

8 నెలల క్రితం కుడి రొమ్ములో 'గడ్డ' ఉందని ఆపరేషన్ చేసి 'ఫైబ్రో అడినోమా' అన్నారు ప్రస్తుతం 6 నెలల గర్భిణిని ఆపరేషన్ చేసిన చోట మళ్ళీ గడ్డలు ఉన్నవి . . . .

తల్లి గర్భవతిగా ఉన్నప్పుడు 'రొమ్ము'లో ఇలా గడ్డలు రావటం సహజం. దీనికి ఫైబ్రో అడినోమా తిరిగి రావటానికి సంబంధంలేదు ఆప రేషన్ చేసేటప్పుడు అన్నీ తీసివేశారు అన్నారు కాబట్టి అవి తిరిగిరావటానికి అవకాశంలేదు. మొదటి సారి గర్భవతిగా ఉన్నప్పుడు 'స్తనమూల గ్రంధులు' పెరగటం పాల ఉత్పత్తి ప్రారంభమవటం— అవి ఒకేచోట చేరినప్పుడు ఇలా గడ్డలుగా అని పించటం సాధారణం. ప్రత్యేక చికిత్స అనవసరం.

**జి. ఎస్. ఆర్. నర్సాపురం.**

8 సం.ల క్రితం వేసెక్టమీ ఆపరేషన్ చేయించు కొన్నాను అప్పటినుండి తుంటి నెప్పి, నడుం నెప్పి ఎక్కువగా ఉన్నది.

వేసెక్టమీకి ఈ నెప్పులకి సంబంధము లేదు. మామూలుగా వయసుమీరిన కొద్దీ, ఎము కలు అరిగిపోయినట్లవడం సహజం. ఇలా అరిగి పోయిన ఎముకలు నరములకు ఒత్తిడి కలిగించటం వల్ల నెప్పి రావడం జరుగుతుంది.

అరుదుగా వేసెక్టమీ చేసేటప్పుడు నెప్పి లేకుండా ఉండడానికి వెన్నెముకలో ఇంజక్షన్ చేస్తే ఇలా రావచ్చును కాని వేసెక్టమీకి ఎవరూ ఈ పద్ధతి అవలంబించరు

ఆక్సీఫినాల్ మాత్రలు రోజుకి ఒకటి చొప్పున వరుసగా 10 రోజులు వాడితే నెప్పితగ్గుతుంది

**ఎస్. ఎస్. ఆర్ మద్రాసు—34**

మా అన్నగారి వయసు 25 సం లు పొత్తి కడుపుకి ఒక ప్రక్కన కాయలుగా ఉన్నది ఇంజ క్షన్లు వాడమన్నారు అంటే అవి వేయించినా తగ్గలేదు.

రోగ నిర్ధారణ సరిగా చెయ్యక మందులు వాడితే ఫలితం ఇలాగే ఉంటుంది

ఈ 'కాయ' హెర్నియానా లేక గజ్జలలో ఉండే లింఫ్ గ్రంధుల వాపా అనేది తెల్సిన తర్వాత చికిత్స మొదలు పెట్టాలి 'హెర్నియా' అయి ఉంటే ఆపరేషన్ చెయ్యటం, ఫైలేరియావల్ల లింఫ్ గ్రంధి వాచి ఉంటే హెట్రజాన్ మాత్రలు వాడటంవల్ల ఈ 'కాయ' తగ్గుతుంది ఏదయినా ప్రత్యక్షంగా పరిశోధించి తేల్చవలసిన విషయం

## వారఫలం

—మహేష్—

**12-7-1974 శుక్రవారం మొదలు**
**18-7-1974 గురువారం వరకు**

**మేషం :—** మీ కార్యక్రమాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**వృషభం :—** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది వారం మధ్యలో అన్ని వ్యవహారాలు బాగుంటాయి వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి ఇతరులతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి స్త్రీలకు —కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది

**మిధునం :** — వృత్తిలో ఆదాయం పెరుగుతుంది మిత్రుల సహాయం లభిస్తుంది వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు వారం ఆఖరులో మీ కార్య క్రమాలు తిరిగి అనుకూలంగానుంటాయి స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కర్కాటకం —** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది సజ్జన సాంగత్యం లభిస్తుంది నూతన విషయాలను తెల్సుకొంటారు వ్యాపారంలో నూతనావ కాశాలు లభిస్తాయి వారం ఆఖరులో లాభంరావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. స్త్రీలకు — దైవకార్యాలు నెరవేరతాయి. అధిక వ్యయం జరుగు తుంది.

**సింహం :—** ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతిలభిస్తుంది. ప్రయో జనంగల పరిచయాలు యేర్పడతాయి. ఉద్యో గంలో గౌరవం బాగుంటుంది. మీరు ఇదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది, వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య :—** మీ తాలూకు మనుష్యులేమిమ్మల్ని వ్యతిరేకిస్తారు. ఉద్యోగంలో కార్యభారం పెరుగు తుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుం టాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ప్రయా ణాలు ఫలిస్తాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. స్త్రీలకు —కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగు తుంది దైవకార్యాలు నెరవేరతాయి.

**తుల :—** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తు లను కల్సుకొంటారు. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వారం మధ్యలో అనవసరమైన శ్రమ కలుగుతుంది. ఆందోళనకు గురి కాగలరు. వారం ఆఖరులో వృత్తిలో ఆదాయం పెరుగు తుంది. స్త్రీలకు —ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం :—** అనవసరమైన సందేహాలు కలుగు తాయి. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రయోజనంగల పరిచ యాలు యేర్పడతాయి. వారం ఆఖరులో ఎవరినీ విశేషంగా నమ్మి వ్యవహరించడం తగదు స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పుణ్య కార్యాలు చేస్తారు.

**ధనుస్సు :—** వృత్తిలో నూతనావకాశాలు లభి స్తాయి సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణి స్తుంది రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. భాగస్వాము లతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది సాటివారితో మాట పట్టింపులు తగవు

**మకరం :—** మీ కార్యక్రమాలు సాఫీగా వుంటాయి సాటివారిలో గౌరవం లభి స్తుంది. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలి స్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి వారం ఆఖరులో మీరు అనుకునేదొకటి జరిగేది మరొకటి కావచ్చును. స్త్రీలకు —ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**కుంభం :—** వ్యాపారంలో సాటివారి పోటీ తగ్గు తుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యో గంలో గౌరవం లభిస్తుంది మీ సంభాషణమే మీకు కీర్తిప్రతిష్ఠలను కలిగిస్తుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభించగలదు. స్త్రీలకు —ఆరో గ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మీనం :—** మీ శ్రమకు తగిన ఫలితం లభి స్తుంది. రావలసిన డబ్బు అందుతుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. వారం ఆఖరులో అన్ని వ్యవహా రాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పుణ్య కార్యాలు చేస్తారు.

# ప్రత్యేక కాఫీ విప్లవం విస్తరిస్తోంది

దక్షిణ దేశంలో కాఫీ త్రాగే
వారందరూ రికరీ ప్రత్యేక రుచిని
ఆస్వాదించడం మొదలుపెట్టారు.
సమృద్ధిగా సంతృప్తినిచ్చే రికరీ తో
కొత్త విశిష్టమైన కాఫీ రుచిని చూడండి
మీరూ ఎంతో ఇష్టపడతారు.




## రికరీ
### ఇన్‌స్టంట్

**ప్రత్యేక రుచితో ప్రత్యేక కాఫీ**

AGIL-RIC-73-4 Tel.

# అవుట్

### యర్రంశెట్టి సాయి

**బస్ దిగి సూట్‌కేస్ రిక్షాలో వేసుకొని ఇంటికి బయల్దేరాడు శోభనాచలం. సంవత్సరం దాటిపోయింది కాకినాడ వదిలి.**

అక్కడిరోడ్లూ, హోటళ్ళూ అన్నీ పాతవే అయినా కొత్తగా కనబడుతున్నయి. రిక్షావాడు గంట కొడుతూ జనం మధ్య నుంచి బులెట్‌లాగా దూసుకెళ్తున్నాడు. మెయిన్ రోడ్‌లోకి వచ్చేసింది రిక్షా. ఓల్గా హోటల్ సెంటర్ చాలా సందడిగా ఉంది ఎప్పటిలాగే.

"కొంచెం మెల్లగా తొక్కవోయ్..."

స్నేహితు లెవరయినా కనబడతారేమోనని అటూ ఇటూ చూస్తూ అన్నాడు శోభనాచలం. అప్పుడే చీకటిపడక పోయినా మార్కెట్టంతా లైట్ల వెలుగుతో నిండిపోయింది. సాధారణంగా ఫ్రెండ్సంతా అక్కడే నుంచుని ఉంటారు. ప్రతిరోజూ ఉదయం సాయంత్రం అక్కడ కలుసుకొని బాతాఖానీ వేయటం ఆ ఊళ్ళో కుర్రాళ్ళందరికీ అలవాటు.

"ఆపవోయ్—ఒకసారి ఆపు..." అని ఆపించాడు శోభనాచలం.

చటుక్కున రిక్షాలోంచి దిగి "రామన్నా! ఒరే!" అంటూ పిలిచాడతను.

కిళ్ళీకొట్టుముందు నుంచుని సిగరెట్ వెలిగించుకొంటున్న రామన్న ఆశ్చర్యంగా శోభనాచలంవేపు చూశాడు.

"ఓరినీ...ఎప్పుడ్రా రావడం?" ఉత్సాహంగా దగ్గరకొచ్చి అడిగాడు.

"ఇదే! ఇప్పుడే బస్ దిగాను..."

"ట్రైనింగ్ అయిపోయిందా?"

"ఓ! పోస్టింగ్‌కూడా అయిపోయింది..."

"ఎక్కడ వేశారు ?"

"సికింద్రాబాద్..."

"వెరీ గుడ్..."

"ఇంకేమిటి విశేషాలు ? మన- బాచ్‌లో ఎవరూ రాలేదా ?"

"ఇప్పుడే సుబ్రమణ్యం, రామచంద్రరావ్, బాబూరావ్‌గాడూ వెళ్ళిపోయారు..."

"అప్పుడే ఇంటికెళ్ళిపోయారా ?"

"ఇంటిక్కాదు. రేలంగీ, రాజబాబూ వాళ్ళంతా వస్తున్నారంటే హాల్ కెళ్ళారు చూడ్డానికి..."

"ఓహో !...అదిసరేగాని ఈమధ్య ఎక్కడైనా టోర్నమెంట్స్ కెళ్ళారా ?" కుతూహలంగా అడిగాడు.

"మొదట్లో వెళ్ళాంగాని—కాలేజితోపాటు ఆ ఉత్సాహం కూడా పోయిందిరా! ఇప్పుడెక్కడికీ వెళ్ళటంలేదు...ఆడటంలేదు..."

శోభనాచలం పూర్తిగా నిరుత్సాహపడిపోయాడు.

"అదేమిటి ?" అడిగాడు దెబ్బతిన్నట్లు.

"పోనీలా ! కూటికా, గుడ్డకా—వెధవగేమ్స్‌దేముంది కానీ — నీకిహమనవేపు ట్రాన్స్ఫర్ కాదా ?"

"ఎందుక్కాదు ? అయిదారు నెలల్లో వచ్చేస్తాను..."

"సరే ! ఇంటికెళ్ళు...సాయంత్రం కలుసుకొందాం మళ్ళీ..."

రిక్షాలో కూర్చున్నాడు శోభనాచలం. అతని మనస్సంతా పూర్తిగా పాడయిపోయింది. రామన్న అలా మారిపోయాడేమిటి ? ఫుట్‌బాలన్నా క్రికెట్ అన్నా ఎంత ప్రాణంగా ఉండేవాడు. తన ఆట చూసి సంతోషంతో ఉప్పొంగి పోతూండేవాడు.

"ఒరే చలం ! ఎన్నేళ్ళయినాసరే ! ప్రాక్టీస్ చేసి నీలాగా ఆడతాన్రా ..." అంటూండేవాడు. పి. ఆర్. కాలేజిలో తను క్రికెట్ కాప్టెన్. వాడు ఫుట్‌బాల్ కెప్టెన్. ఫుట్‌బాల్ మాత్రం వాడు చాలా అమోఘంగా ఆడేవాడు.

తను ఎలాగోలా ఇటుసైడ్ ట్రాన్స్ఫర్ చేయించుకొని, ఒక క్రికెట్ క్లబ్ పెట్టి, తన బాచి వాళ్ళందరితోనూ టోర్నమెంట్స్ కెళ్ళాలనీ, తామే స్వయంగా నిర్వహించాలనీ అనుకున్నాడు. కానీ, మరి వీడేమిటి ఇలా తయారయ్యాడు. కాలేజీ వదిలేసినంత మాత్రాన ఆ ఉత్సాహం, ఆటల్లో ప్రావీణ్యం కూడా వదిలేయాల్సిందేనా ?

"హలో చలం..."

ఉలిక్కిపడి అటువేపు చూశాడు శోభనాచలం.

'మనోరమ' హోటల్‌కి పోయే సందు దగ్గర నుంచుని ఉన్నాడు రమణ.

"హలో రమణ్ !" రిక్షాలోంచి దిగుతూ అన్నాడు.

"ఎప్పుడు, బాస్ ! రావటం ?"

"ఇప్పుడే..."

రమణ తన జూనియర్. అతనికి తనే క్రికెట్ నేర్పాడు. తన తర్వాత కాలేజీలో రమణే మంచి బౌలర్. బాటింగ్ కూడా బాగానే చేసేవాడు.

"ఎలావుంది రమణా నీ క్రికెట్ — ఆడుతున్నావా?"

గట్టిగా నవ్వాడు రమణ.

"లేదు బాస్ ! అన్నీ వదిలేశాం. జాబ్ కోసం చచ్చేట్లు తిరుగుతున్నాను ఈ క్రికెట్ ఎవడికి గుర్తుంటుంది ? ఆ మధ్య నో ఇంటర్వ్యూకెళ్ళాలే ! అక్కడ 'గేమ్స్' సర్టిఫికెట్స్ అన్నీ చూసి 'గెటవుట్' అన్నాడు..."

"అదేమిటి ?" ఆశ్చర్యంగా అడిగాడు శోభనాచలం.

"ఖచ్చితంగా 'గెటవుట్' అన్నేదనుకో ! వాడికసలు క్రికెట్ అంటే ఏ మాత్రం పడదట—క్రికెట్ అంటే పనీ పాటా లేని వాళ్ళంతా ఉదయంనుంచీ సాయంత్రం వరకూ చేసే గాంబ్లింగ్ అన్నాడు. ఆ ఆటని ఆడే వాళ్ళనికూడా నేను ద్వేషిస్తానన్నాడు ... థాంక్యూ... అనేసి బయటికొచ్చేశాను..." నవ్వుతూ అన్నాడు రమణ.

"ఇడియట్... ఎవడువాడు ?" కోపంగా అన్నాడు శోభనాచలం.

"ఎవడో ప్రైవేట్ కంపెనీవాడులే ! అది సరేగాని ఎన్నాళ్ళుంటావ్ ఇక్కడ ?"

"వారం రోజులు శెలవుపెట్టి వచ్చాను..."

"ఓకే... వెళ్ళు మరి... తరువాత కలుద్దాం..."

శోభనాచలం మళ్ళీ రిక్షాలో కూర్చున్నాడు.

ఈసారి అతనికి నిస్పృహతోపాటు ఆశ్చర్యంకూడా కలిగింది. రమణ ఇలా మారిపోయాడేమిటి ? ఇదివరకు ఎప్పుడూ తనని వదలకుండా వెంటే తిరిగేవాడు. తనెక్కడికెళ్తే అక్కడికి కొస్తూండేవాడు. క్రికెట్ గురించీ, పెద్ద పెద్ద ఆటగాళ్ళగురించీ, వాళ్ళ కౌశలం

గురించీ ఇరవై నాలుగ్గంటలూ మాట్లాడుతోండేవాడు.

ఇలాంటి ఉత్సాహం లేనివాళ్లతో తనింక క్లబ్బేం పెట్టగలడు?

ఇల్లు చేరుకొన్నాడు శోభనాచలం. చెల్లాయిలూ తమ్ముళ్లూ అందరూ చుట్టుముట్టేశారు సంతోషంతో. రాత్రంతా తన ట్రైనింగ్ గురించీ ఉద్యోగం గురించీ వాళ్లకు కబుర్లు చెప్తూనే ఉన్నాడు. కాని అతని మనసంతా జానకి మీదే ఉంది. నాలుగిళ్లవతలే జానకి ఇల్లు. తనంటే ఎంత ఇష్టమని? తన ఆటచూసి ఉప్పొంగిపోతూండేది. బాటింగ్ చేస్తోంటే చాలా ప్రోత్సాహం యిస్తూ కేకలు వేసేది.

“అయ్‌వాంట్ సిక్సర్ చలం..!” అంటూ ఆమె గొంతు వినబడుతోంటే తనకూ ఎక్కడ లేని ఉత్సాహం పుట్టుకొచ్చేది.

కారున్నా ఒకోరోజు కాలేజీకి తనతో పాటు నడిచి వచ్చేది.

“చలం...నిన్న ఎంత అద్భుతంగా ఉందో తెలుసా నీ బౌలింగ్—రియల్లీ—సింప్లీ మార్వలెస్...అయ్‌లైక్ యూ ఎంజాయ్ లవ్ యువర్ గేమ్...”

నవ్వు వచ్చింది శోభనాచలానికి. నిజంగా అవి—ఆ కాలేజీరోజులు మనిషి జీవితంలో బంగారు కాలం కదూ”

ఆ రోజు తన కాలేజి టీమ్‌కీ—ఇంజనీరింగ్ కాలేజ్ టీమ్‌కీ మాచ్ జరిగింది.

ఆట అయిపోయాక మామూలుగానే అంతా తనని చుట్టుముట్టేశారు. అందరూ ఎవరి దారిన వాళ్లు పోయాక బెరుగ్గా తన దగ్గర కొచ్చింది జానకి.

“మీరు చాలాబాగా ఆడారు. మా డాడీకూడా కాసేపు మాచ్ చూసి వెళ్లారు. మిమ్మల్ని రేపు మార్నింగ్ కాఫీకి ఇన్‌వైట్ చేయమని చెప్పారు. తప్పకుండా వస్తారు కదూ ?”

“సారీ! రేపుకుదరదు. మరోసారి వస్తాలెండి...” బెట్టుసరిగా అన్నాడు తను...

ఆమె మొఖం చిన్నబోయింది. తలవంచుకొని వెళ్లిపోయింది అక్కడి నుంచి స్నేహితులు అందరూ ‘తనవంక ఈర్ష్యగా, ఆశ్చర్యంగా చూడటం ఇంకా గుర్తుంది



తరువాత వారం రోజుల వరకూ ఆమె కనిపిస్తూనే ఉందిగాని మాట్లాడ్డానికి ప్రయత్నించలేదు. పోలీస్ టీమ్‌కీ, కాలేజీ టీమ్‌కీ జరిగిన ఎగ్జిబిషన్ మాచ్‌లో తను సెంచురీ కొట్టాడు. అందులో ఏడు సిక్సర్‌లు. జానకి. గొంతు తనకి వినబడుతోనే ఉంది. ఆట ముగిశాక సైకిల్ మీద ఇంటికి బయల్దేరాడు తను. చీకటి పడుతోంది అప్పుడే. కాలేజ్ గేటుదాటి మెయిన్‌రోడ్ దగ్గర కొచ్చేసరికి “మిస్టర్ చలం...” అన్న గొంతు వినిపించింది.

సడెన్‌బ్రేక్ వేసి వెనక్కితిరిగి చూశాడు ఎవరాఅని. రోడ్డుపక్కనే ఆగిఉన్న కార్లోంచి దిగుతూ జానకీ, ఆమె తండ్రీ కనిపించారు.

దగ్గరగా వచ్చాడాయన.

“మార్వలెస్లీ శోభనాచలం—బాటింగ్ చాలా అద్భుతంగా ఉంది ... కంగ్రాచ్యులేషన్స్...”

“థాంక్యూసర్...”

“అయ్ లైక్ క్రికెట్ సోమచ్... కాలేజ్ ‘డేస్’లో నేనూ క్రికెట్టంటే పడి చచ్చేవాణ్ని ...కాని ఆ రోజుల్లో జనం ఫుట్‌బాలంటే ప్రాణాలిచ్చేసేవాళ్లు. నేను క్రికెట్ మానేసి ఫుట్‌బాల్ నేర్చుకున్నాను. అప్పటికి జనం క్రికెట్ అంటే వెర్రెత్తిపోడం మొదలెట్టారు ...సో...ఇహిహి...” అంటూ నవ్వాడాయన.

తనూ నవ్వాడు శోభనాచలం.

“రేపు కాలేజ్ శెలాగూ శలవ కదా, మధ్యాహ్నం మా ఇంటికి భోజనానికి రండి...

అమ్మాయి చెప్పింది. మా యింటి దగ్గర్లోనే నటగా మీ ఇల్లుకూడా...”

కాదనలేకపోయాడు శోభనాచలం.

“మీ కెందుకంత శ్రమ?” నవ్వుతూ జానకివంక చూసి అన్నాడు.

“నో...నో...ఇటీజ్ ప్లెజర్...” అంది జానకి సిగ్గుపడుతూ.

మర్నాడు మధ్యాహ్నం పదకొండింటికల్లా వాళ్లింటికెళ్లాడుతను. జానకి తన కోసం ఎదురుచూస్తూంది వసారాలో.

“రండి! నాన్నగారు ఇంకో అరగంటలో వస్తానని ఫోన్ చేశారు. అంతవరకూ మేడ మీద కూర్చుందాం...”

మేడమీద గదిలో కూర్చున్నాడు శోభనాచలం.

“ఇది నాగది...” అంది నవ్వుతూ.

గదంతా కలియజూశాడు శోభనాచలం.

(38 వ పేజీ చూడండి)

సీరియల్

# ...రెండు పువ్వులు

రాధారాఘవ

*[గతసంచిక తరువాయి]*

రావులో ఫోన్‌లో మాట్లాడుతున్న సింగ్ భార్య కంఠం గమ్మత్తుగా వుంది

"ఆ కులాసాయే మా వారు ఊళ్ళోలేరు. ఇవ్వేళ ప్రొద్దుటే కేంపు వెళ్ళారు. ఇంకా మీ గదిలో లైటు వెలుగుతూండడంచూసి, మీకుగా నిద్ర పట్టడం లేదు గాబోలనుకుని చేశాను"

"ఏడవలేకపోయ్యావ్" అనుకుని, "అహా. అలాగా?" అన్నాడు. "ఏం? ఏదైనాపనా?"

"పనేమరి. చాలా పెద్దపని" అంటూనవ్వి, "నాకేం తోచడంలేదు ఒకసారి రాకూడదూ? ఛస్ ఆడుకుందాం" అంది.

"ఇప్పుడా?"

"ఆ! ఏం? ఏమంత టైమైపోయిందనీ? ఇంకా పదేగదా కొట్టింది. పిల్లలు కూడ పడుకుండిపోయారు"

"బయట చినుకులు పడుతున్నట్టున్నాయ్"

"అందుకేగదా? — మరి మిమ్మల్ని పిలుస్తోన్నది. ఈ ఉరుములూ మెరుపులూతో, ఒంటరిగా ఉండాలి అంటే భయం వేస్తోంది.

ఆవిడ మాటల్లో వినిపిస్తోన్న క్రొత్త తరహాకి! అంత చలిలోనూ మధుకి ముచ్చెమటల్లు పోశాయి. ఫోనుని పట్టుకునిఉన్న అతని పొడుగాటి బలిష్టమైన వ్రేళ్ళు, రిసీవర్‌మీద గట్టిగా బిగుసుకున్నాయి.

"ఏమిటి? — ఏదో ఆలోచిస్తున్నట్టున్నారు! తడుస్తానేమోనని భయపడ్డంలేదు గదా, కొంపదీసి??.." ఆవిడ నవ్వుతోంది. నగలబడి నవ్వుతోంది ఆనవ్వు మరింత గాభరా పెడ్తోంది మధుని.

తడారిపోతోన్న నోటిని, అతికష్టంమీద పెగుల్చుకుని, "అదికాదు..." అంటూ ఏదో చెప్పబోయాడు

"ఏదికాదు?" అంటూ మధ్యలోనే అడ్డుకుందావిడ. "మీరింకేం చెప్పినా, నేను వినదలుచుకోలేదు. ఈ క్షణం కోసం ఎన్నాళ్ళనుంచో ఎదురుచూస్తున్నా. దొరికిన అవకాశాన్ని జారవిడుచుకునే మనస్తత్వం కాదు నాది.

మీరు ఆఫీసు నుంచి ఎప్పుడొస్తారా అని ప్రొద్దుటనుంచి చూస్తున్నా. నేను వెళ్దామనుకునే సరికి, తమరు సుషమా దేవిగారితో షైరుకి చెక్కేశారాయె మీ కోసం ఎదురు చూసి కళ్ళు కాయలు కాచాయి."

ఆ వాక్ప్రవాహాన్ని ఆపుతూ చటుక్కుని అన్నాడు— "అర్జంటుగా చూడాల్సిన ఆఫీసు ఫైల్సు కొన్ని ఉన్నాయి —సారీ! ఏం అనుకోకండి ఇప్పుడు రావడం కష్టం."

> *జరిగినకథ:* మధు ఢిల్లీలో ఒక పెద్ద ఉద్యోగి దక్షిణాది వారన్నా వారి పిండివంటలన్నా ఇష్టమున్న సుషమ అతనితో చనువుగా ఉంటుంది. మధుకి ప్రక్కింటి మిసెస్. సింగ్ కుటుంబంతో పరిచయం వృద్ధి చెందుతుంది. తండ్రి దశరథ రామయ్య నుంచి ఉత్తరం రావటంతో ఇంటికి వెళుతున్న మధును కంజీవరం చీరె, ఆవకాయ తెమ్మంటుంది సుషమ. కృత్రిమ నాగరికతకు అలవాటుపడ్డ మధుకి స్వగ్రామంలోని ప్రశాంత వాతావరణం నచ్చదు. ఎవరిని వివాహమాడుదామా అని సుషమ — సీతలను బేరీజు వేసుకున్న మధు, సీతను వివాహం చేసుకోవాలని ఢిల్లీ తిరిగి వచ్చేస్తాడు. సుషమకీ, మిసెస్ సింగ్‌కీ వారు కోరిన వస్తువులు తెచ్చిచ్చి మన్ననలు పొందుతాడు మధు ఒకరోజు మిసెస్ సింగ్. ఒక రాత్రివేళ ఫోన్ చేసూ...

"సుషమతో షికార్లు కొడుతోన్నప్పుడు, అర్జంటు ఫైల్సని అడ్డు రాలేదేమిటి?

"మీరేం అనుకోవద్దు. సింగ్‌గారు లేనప్పుడు, యిలాంటి టైములో నేనొస్తే మర్యాదగా ఉండదు"

"మర్యాద! మర్యాద! ఎవరైనా నసరే. అర్థంలేని మాటలు మాట్లాడితే నాకు వినుగు."

"మీకు కోపమొచ్చినాసరే. నేను మాత్రం చచ్చినా రాలేను. తెలిసుండీ, మిత్రద్రోహం తలపెట్టలేను. అంతగా సాయం కావాలీ అంటే మా నౌకర్ని పంపుతా!!"

ఆవిడ విసురుగా ఫోను పెట్టేసింది.

పెద్ద అగాధంలో పడబోయి, ప్రమాదం నుంచి తప్పించుకున్నట్టుగా ఉంది; మధుకప్పుడు. శరీరంలో అణువణువూ విస్తృతంగా వ్యాపించింది. కాళ్ళూ చేతులూ తేలిపోతున్నట్టున్నాయి.

"సుషమా ప్రవర్తనకే, అర్థంగాక బుర్ర బద్దలవుతూంటే, గోరుచుట్టుమీద రోకలిపోటులా పైగా యిదొకటి ఎంత ధైర్యంగా పిలుస్తోందావిడ!

సోషల్ పేరుతో ఎంత విచ్చల విడిగా ప్రవర్తిస్తోంది! తను యిచ్చిన చీరకు, వేరుగాఅర్థం తీసుకుందా? లేక ఆవిడ స్వభావమే అంతా?

భర్త ఎదుట ఉన్నప్పుడు కూడ, ఆవిడ చనువుగా మీద చెయ్యివేసి మాట్లాడినా, వాళ్ళు అందరితోటీ సోషల్‌గా ఉంటారు గదాని, మామూలుగా తీసుకున్నాడు దీనిని ప్రోత్సాహంగా తీసుకుని, ఆవిడ ముందంజ వేయలేదు గదా?

ఎంత ఘోరం!

భర్తయిచ్చిన స్వేచ్ఛని, అతని పరోక్షంలో, ఆవిడ ఎంతగా దుర్వినియోగ పరుస్తోంది?

తనచాటుని ఏం జరుగుతోందో, అతనికి తెలీదు గదా? తెలిస్తే అంత స్వేచ్ఛ ఇచ్చునా? పాపం! ఇంతకంటే ఘోరాన్యాయం మరొకటుండదు.

"తనుయింటిదగ్గరలేని సమయంలో, భార్య పరాయి పురుషులతో సరాగాలాడుతోందని తెలిస్తే, ఏ భర్తా సహించలేడు భగవంతుడా! ఈ రకం జీవితం ఎవరికీ ఒద్దు" అనుకున్నాడు తలపట్టుకుంటూ

* * *

సుషమ వస్తే మాట్లాడకూడదనీ, బతి

మార్చుకోవాలనీ, అనుకున్నాడు కాని మధుకి, రెండు రోజులైనా సుషమ జాడే తెలీలేదు.

అతనికోపం, ఆ రెండు రోజుల్లోనూ మరింత ఎక్కువయిందేగాని తగ్గలేదు.

మూడో రోజు సాయంత్రం సుషమ పైకి వచ్చింది. మధు, సౌత్‌నుంచి తెచ్చిచ్చిన నిమ్మపండు రంగు కంచి పట్టుచీర కట్టుకుంది. దబ్బపండులా మిసమిసలాడుతోన్న ఆ అమ్మాయి ఒంటిమీద, ఆ చీరకే ఒక ప్రత్యేక అందం వచ్చింది.

హంసలా ఒయ్యారాలు ఒలకబోస్తూ, మందగమనంతో దగ్గరగా వచ్చింది.

దానిమ్మగింజల్లాంటి పలువరస తళుక్కుమనేలా, నవ్వింది అందంగా.

ఆ రూప లావణ్యాలు చూస్తోన్నకొద్దీ, మధుకోపం మంచు కరుగుతోన్నట్టుగా కరిగిపోసాగింది.

"ఈ అమ్మాయి నాది. ఈ అందం నా స్వంతం కావాలి. తల్లిదండ్రులకోసం యింత అందాన్ని వదులుకోలేను" అనుకున్నాడు లోపల్లోపలే.

"ఈ అమ్మాయి, నిన్ను ఇన్సల్ట్ చేసి వెళ్ళిపోయింది. నీ దగ్గరెంత చనువుగా ఉంటుందో, ఆ యువకుడితోటీ అంతే చనువుగా ఉంది. మర్చిపోయావా, అప్పుడే?"—లోపలినుంచి, ఎవరో నిలదీస్తున్నారు మరో ప్రక్క.

ఆ అమ్మాయి సౌందర్యంతో, మతిపోయి, మూఢుడిలా చూస్తోన్న మధునిచూసి, సుషమ గలగలా నవ్వింది.

— "అబ్బాయిగారు, ఎక్కడా ఇంకా లోకంలో ఉన్నట్టు లేరే? ఏ లోకంలో విహరిస్తున్నారు?" అంటూ మాట్లాడించింది.

ఆవేళ సుషమ, క్రొత్త అందాలు సంతరించుకుని బంగారు బొమ్మలా మెరిసిపోతోంది. ముఖం వింతకాంతితో వెలిగిపోతోంది. ఆ ముఖంలో ఎంతాపుకుందామన్నా ఆగని ఉత్సాహం ఉరకలు వేస్తోంది. కళ్ళల్లో మెరుపులు తళతళ్లాడుతున్నాయి. ఏనాడూ, సిగ్గంటే ఏమిటో ఎరగని మనిషి, మాటిమాటికి సిగ్గుపడుతోన్నట్టుగా, గులాబీల్లా ఎఱ్ఱబడుతోన్న బుగ్గలు సాక్ష్యమిస్తున్నాయి.

— ఆ అమ్మాయిలో ఎంతో మార్పు కనిపిస్తోంది. కాని... అదేమిటో మాత్రం ఎంతకీ అర్థంగావడంలేదు మధుకి.



"ఏమిటి?—అంతలా వెలిగిపోతున్నావ్—" అన్నాడు; ముఖంలో ఏ భావం ప్రస్ఫుటం కానివ్వకుండా.

"అమ్మయ్య! ఇన్నాళ్ళకు. వస్సెప్స్ లో పెట్టినా, ఇప్పటికైనా యీ మాత్రం తెలుసుకోగల్గారన్న మాట. మరి యీ ఇంత సంతోషానికీ మూలం ఏమిటో ఊహించండి చూద్దాం."

"అబ్బ, చంపక చెప్పదూ. నాకసలేవిసుగ్గా ఉంది" తను ముభావంగా ఉన్నా, తనకోపాన్ని గుర్తించడంలేదన్న దుగ్ధతో, అనాటి కోపం తాలూకు వేడి, పూర్తిగా పోనందున, కొంచెం చిరాగ్గానే అన్నాడు మధు.

"ఏదోగుడ్ న్యూస్ చెప్తాంగదాని పోనీ, మీ వికారమంతా నా మీద చూపెడ్తారేమిటి?— మీ మూడ్‌బాగున్నట్టు లేదు. నాకెందుకొచ్చిన గొడవ. నే వెళ్ళిపోతున్నా. మా డాడీయే వచ్చి పిలుస్తారు లెండి. రాత్రికి మా యింట్లో మీకు డిన్నరుంది. చెప్దామని వచ్చా. అంతే"

"నా ఒంట్లో బాగుండలేదు. నే నెక్కడికీ రాలేను."

"అదేదో మా నాన్నగారితోనే చెప్పండి. అదిగో వస్తున్నట్టున్నారు" అంటూ చటుక్కున లేచి, ఒక ప్రక్కగా నిలబడింది.

ముసలాయన మరో యువకుడితో కలిసి వచ్చాడు.

అతన్ని చూడగానే ఆ అమ్మాయి ముఖం, ఎఱ్ఱమందారంలా మరింత అరుణిమదాల్చింది. ఉరకలు వేస్తూ పైకొస్తోన్న సంతోషాన్ని పెదిమలు దాటనీకుండా, పంటితో నొక్కిపట్టి మరి ఆపుతోంది. చేతికున్నవాచీతీసి, హంకీతో తుడిచి మళ్ళీ చేతికి పెట్టుకుంటూ, నిలబడిపోయింది తలొంచుకొని.

"సుషమా చెప్పిందనుకుంటానుమీకు..."

భోజనం గురించి అనుకున్నాడుమధు. "ఆ. ఆ. చెప్పింది" అంటూ తలూగించాడు.

"చూడండి, డాడీ! నేనుపిలిస్తే రానంటున్నారు. మీరే చెప్పండి" అంటూ మధు మీద ఫిర్యాదు చేసింది సుషమ.

ఆయన నవ్వుతూ, "రాకపోతే ఊరుకుంటామేమిటి? లాక్కువెళ్లిపోవడమే—ఈయనే మా ఇంట్లో ఉంటోన్న రావుగారు, మా ఫామిలీలో ఒక మెంబరులానే కలిసి పోయారు.

...ఇతను ప్రీయతమ్ సింగ్. — సుషమా

చెప్పిందనుకుంటాను మీకు.—ఇవ్వాళే న్యూయార్కు నుంచి వచ్చాడు. — సుషమాకి కాబోయే భర్త" అంటూ పరిచయం చేశాడు, సుషమా తండ్రి.

వేయి పిడుగులు ఒక్కసారిగా నెత్తిమీద పడినట్లయింది మధుకి.

"ఊహు. ఆ విషయం నేనేం చెప్పలేదు. మీరు చెప్పి ఉంటారనుకున్నా." నెమ్మది, నెమ్మదిగా, సిగ్గుగా సమాధానం చెప్తోంది సుషమ.

"గ్లాడ్ టూమీట్‌యూ" అంటూ చేయి అందించాడు ఆ నూతన యువకుడు.

"ప్లీజ్డ్ టూ మీట్‌యూ" అంటూ మరో లోకంలోంచి మాట్లాడుతోన్నట్టుగా అసి, ఆ చేయి అందుకున్నాడు మధు.

—ఆచేయి, తెల్లగా, పొడుగాటి వేళ్ళతో బలిష్ఠంగా ఉంది. కుడిచేతికి కడియం, ఎడమ చేతికి విలువైన ఒమేగా వాచీ ఉన్నాయి. మనిషి మంచి ఎత్తుగా, ఎత్తుకుతగ్గ లావుతో ఠీవిగా, హుందాగా కనిపిస్తున్నాడు. కళ్ళల్లో చురుకుదనం కొట్టొచ్చేలా కనిపిస్తోంది. తలకి టర్బన్ చుట్టాడు. తెల్లటి ముఖానికి, నల్లటి గెడ్డం, ఎంతో అందాన్ని కలగచేస్తోంది.

"ఏమిటందమో? ఇంట్లో ఉన్నప్పుడు చూడాలి—పీర్ల అవతారం-తలా, గెడ్డం ఇంత పొడుగ్గా జుట్టు విరబోసుకుని, బైరాగుల్లా ఉంటారు" అనుకున్నాడు ఈర్ష్యగా.

"ప్రియతమ్ మా బంధువుల్లో అబ్బాయే. అక్కడే వర్కు చేస్తున్నాడు. వెళ్లేముందే ఎంగేజ్‌మెంట్ జరిగింది. ఉద్యోగం కూడ దొరికింది గాబట్టి, పెళ్లి చేసుకు ఏకంగా సుషమాని కూడ తీసుకెళ్లిపోదామని వచ్చాడిప్పుడు. త్వరలోనే మంచి ముహూర్తాలున్నాయి. వివాహ మవగానే యిద్దరూ కలిసి తిరిగి న్యూయార్కు వెళ్లిపోతారు." అంటూ చెప్పుకొస్తున్నాడు ముసలాయన.

అక్కడ కూర్చున్న గంట సేపులోనూ, మధుకంటే ఎక్కువగా అతనే మాట్లాడాడు.

మధు తన ఆందోళనని అణచిపెట్టుకుంటూ, ముఖ కవళికలు మారకుండా చూస్తూ, నానాయాతన పడుతున్నాడు. ఏంమాట్లాడకపోతే బాగుండదని, మధ్యమధ్య అతనిగురించి ఒకో ప్రశ్న వేస్తున్నాడు.

ఆ ప్రశ్నకే పొగడీసి అరగంట జవాబిస్తున్నాడతను.

అరచేయి గడ్డానికాన్చి, మోచేతిని ఒళ్లో పెట్టుకు కూర్చుని, అతని కబుర్లన్నీ మంత్రముగ్ధలా వింటోంది సుషమ.

అక్కడి నైట్ క్లబ్బులగురించీ, అమ్మాయిల అందచందాల గూర్చి, వీక్ ఎండ్స్‌న ఆడా మగామిత్రులు కలిసి, ఎక్కడికో ఒక చోటికి వెళ్లి, ఎలా ఎంజాయ్‌చేసేదీ, డేటింగ్ కోసం, ఆడపిల్లలు, మగపిల్లలు తమకునచ్చిన పార్ట్నర్సుని ఎన్నుకుని, ఎలాసరదాగా గడిపేదీ, వరస పెట్టి చెప్పుకొస్తున్నాడతను.

ఎంతసేపూ అతని నోటినుంచి, అమ్మాయిలూ, నైట్ క్లబ్బులూ తప్పించి, మరో విషయం రావడంలేదు.

"న్యూయార్కు వెళ్లి, అమ్మాయిలగురించి బాగాస్టడీచేసి వచ్చినట్టున్నాడు" అనుకున్నాడు మధు కసిగా.

ఆ తర్వాత, ఒంట్లో బాగుండలేదన్నా వినకుండా, మధునికూడా, క్రిందకు లాక్కొళ్లారు వాళ్ళు డిన్నర్‌కి.

భోజనాల బల్లమీద తెల్లటి క్లాత్ పరిచి,

---

ఆడవారు తమ వయస్సులనుంచి తగ్గించే సంవత్సరాలు ఊరికేనేపోవు—వాటిని తక్కిన ఆడవారి వయస్సులకి కలుపుతారు...

---

ఖరీదైన క్రోకరీ అందిమీద అమర్చారు. ఫ్లవర్ వేజుల్లో పెట్టిన గులాబీలు గదంతా గుబాళిస్తున్నాయి.

భోజనానికిముందు డ్రింకులు సర్వ్‌చేశారు.

"రావుసాబ్ హాట్‌డ్రింక్స్ తాగరు. ఈ సాఫ్ట్ డ్రింక్ ఆయనకు" అంటూ ఫ్రిజ్‌లోంచి కోకోకోలా తీసి, గ్లాసులో పోసి అందులో ఐస్ క్యూబ్స్ వేసి మధుకిచ్చింది, సుషమ. అతను ఆశ్చర్యంగా, వింతజంతువును చూసినట్టు చూశాడు మధువైపు.

"రియల్లీ?—ఆర్ యూ ష్యూర్?" అనడిగాడు.

మధు తల ఊగించాడు.

అతను గ్లాను తర్వాత గ్లాసు, అతి సునాయాసంగా ఖాళీ చేస్తున్నాడు. మధ్యలో, అప్పుడప్పుడు సుషమను కూడ బలవంతం చేస్తున్నాడు—తాగమని.

సుషమ వెనుదీయడంచూసి, "లాభంలేదు. హోప్‌లెస్. ఇలా అయితే యింకనువ్వు, నాతో ఫారన్ కంట్రీస్‌కేం రాగలవు? అక్కడి అమ్మాయిలనుచూస్తే బెదిరిపోతావు. వాళ్లముందు నేను తాగేది ఒక లెక్కకాదు" అంటూ బెదరగొడుతున్నాడు, విస్కీబాటిల్స్ ఖాళీచేస్తూ. గ్లాసులో కొద్దిగా షాంపెయిన్ వేసి, సోడా కలుపుకుని నానా అవస్థ పడుతూ, తాగడానికి ప్రయత్నం చేస్తోంది, సుషమ.

"అవునుమరి. చలిదేశాల్లో ఎలాగా తప్పదు. లేకపోతే ఆ చలికి తట్టుకోవద్దూ? నెమ్మది నెమ్మదిగా కొంచెం మొదలుపెడితే, క్రమేపీ అదే అలవాటైపోతుంది. శరీరాన్ని కూడ వేడిపుట్టి, ఆరోగ్యం కలుగుతుంది. క్రొత్తలో ఎవరికైనా అలాగే ఉంటుందిలే. తర్వాత ఒద్దన్నా మానవు — సుషమా" తండ్రి కూతుర్ని ఉత్సాహపరుస్తున్నాడు.

అతని కోసరం చికెన్‌కూడ తెప్పించిపెట్టారక్కడ. సుషమా వాళ్లింట్లో, అందరూ వెజిటేరియన్సే. అందువల్ల, వాళ్లింట్లో ధైర్యంగా భోజనం చేసేవాడు మధు.

కాని యిప్పుడు, అదే టేబులుమీద, అతను తన ఎదురుగా కూర్చుని, స్పూను ఫోర్కుతో, చికెన్‌ని పీక్కుతింటూంటే, వాంతొస్తోన్నట్టుంది మధుకి.

"నాన్ వెజిటేరియన్ కూడ తినకపోతే ఎలా? నీకోసం వెజిటేరియన్ ఎవరిస్తారక్కడ? కొంచెం తినిచూడు — ఎంత బాగుంటుందో?"

సుషమ వారించలేదు. "తినలేను బాబోయ్!" అంటూ గొడవ పెట్టలేదు. "ఛీఛీ అసహ్యం" అంటూ నిరసించనూ లేదు.

"నిజమే. తప్పదుమరి. అలవాటు చేసుకోవాల్సిందే" అన్నట్టుగా, అతను తన ప్లేట్లో వేసిన మటన్‌ని, చమ్చాతో తీసి, నెమ్మదిగా నోట్లో పెట్టుకుంది.

మధుకి, ఎప్పుడు అక్కడ్నుంచి లేచి పారిపోదామా అనుంది. కాని సభ్యత కోసం, కూర్చోవాల్సి వస్తోంది.

భోజనాలయాక, అతనేదో ఇంగ్లీష్ మ్యూజిక్ పెట్టాడు. దానితోపాటు సమంగా ఒంటిని ఊగిస్తూ, దానికి లయగా, కాళ్లతో చిన్నగా స్టెప్స్ వేస్తున్నాడు.

హఠాత్తుగా సుషమ వైపు తిరిగి, "అన్నట్టు ఎంతవరకూ వచ్చింది నీ డేన్సు?— బాగా స్టెప్స్‌వేయగల్గుతున్నావా?" అనడిగాడు.

సుషమ సిగ్గుపడ్డం చూసి, తండ్రి సమాధానం చెప్పాడు. "బాగా వచ్చేసింది.

# మీ జుట్టుకి చమురు చుక్క కన్నా ఎక్కువ మేలు కలిగించేది ఏదైనా వుందా

ఉంది. ఒక చుక్క చమురు అదనంగా ఒక చుక్క పరిశుద్ధ సిల్విక్రిన్



ఎందుచేత?

చమురు చేసేదేమిటంటే
సిల్విక్రిన్ హెయిర్ డ్రెస్సింగ్‌లోని ఎక్కువ తేలికైన చమురు యితర చమురుల జిడ్డు లేకుండా మీ జుట్టుని చక్కగా దువ్విన సహజంగా కనిపించేట్టు చేస్తుంది



పరిశుద్ధ సిల్విక్రిన్ చేసేదేమిటంటే
మీ జుట్టుని సమృద్ధిగా పెరిగేట్టు చేసే 17 అత్యవసర మాంసకృత్తి అనుబంధ పదార్థాలు పరిశుద్ధ సిల్విక్రిన్‌లో వున్నాయి. పరిశుద్ధ సిల్విక్రిన్ కేంద్రుకం మొదళ్లలోకి ప్రవేశించి, వాటిని బలవర్ధకం చేస్తుందని ఒక కొత్త పరిశీలన ద్వారా రుజువైంది.

సంపూర్ణ కేశ సంరక్షణకోసం కేవలం సిల్విక్రిన్ హెయిర్ డ్రెస్సింగ్‌లో మాత్రం పరిశుద్ధ సిల్విక్రిన్ మరియు చమురు మేళవించబడి వున్నాయి.
పరిపూర్ణ కేశ సౌభాగ్యంతో జుట్టు అందంగా దువ్వినట్టు వుండాలంటే సిల్విక్రిన్ హెయిర్ డ్రెస్సింగ్ వాడండి.




మీ జుట్టుని మీ అంత జాగ్రత్తతోనూ సంరక్షిస్తుంది.

# సిల్విక్రిన్ హెయిర్ డ్రెస్సింగ్





## రెండు పువ్వులు

మొదలుపెట్టి చాలాకాలమైంది గదా?"

"ఏదీ? చూపించు—కమాన్" అంటూ చెయ్యి అందించాడు

సుషమ లేవకపోవడంచూసి, "అరె! వెరీ బాడ్ నువ్వింకా ఏదో మోడరన్ అమ్మాయి వనుకున్నాను పల్లెటూరి పిల్లలా బిహేవ్ చేస్తున్నావేమిటి? నాతో చేయడానికే నువ్వు సంకోచిస్తూంటే, యింక పరాయివాళ్ళతో ఏం చేయగలుగుతావు? రేపు పదిమందిమధ్య చేయాల్సొస్తుంది అప్పుడేం చేస్తావు? కమాన్ డోంట్‌ఫీల్ షై డియర్!" అంటూ చెయ్యిపట్టుకుని ఒక్కలాగు లాగాడు

ఆ ఊపుకి సుషమా తూలి, అతనిమీద పడింది నున్నగా, అందంగా మెరుస్తోన్న తెల్లని నడుము చుట్టూ చెయ్యివేసి, ఆ అమ్మాయిని పొదివిపట్టుకుని, దగ్గరకు లాక్కున్నాడతను

మధుకి ఒళ్ళంతా మంటలు మంటలుగా ఉంది అక్కడేఉంటే యింకా ఏం చూడాల్సి వస్తుందోనని, చటుక్కున "సారీ ఏం అనుకోవద్దు నాకు టెంపరేచర్ రైజైపోతోంది. కూర్చోడం కష్టంగా ఉంది నేను వెళ్తున్నా" అని చెప్పేసి వచ్చేశాడు

అతని మాటలువిని, తలెత్తి చూసిన సుషమ, మరుక్షణంలో, కాబోయే హాస్బెండుతో కలిసి డేన్సు చేయడంలో మునిగిపోయింది

సుషమా తండ్రిమాత్రం అతని వెనకాలే, యివతలకొచ్చాడు 'ఏదైనా మెడిసన్ ఉందా? లేకపోతే డాక్టరికి ఫోన్‌చెయ్యనా?" అనడిగాడు

"మరేం అక్కర్లేదు నా దగ్గర ఆస్ప్రో ఉన్నాయి కొంచెం సేపు రెస్టు తీసుకుంటే, అదే సర్దుకుంటుంది— అతనికి తెలీకుండానే, అతని కంఠస్వరం కఠినంగా ధ్వనించింది ఆగకుండానే, సమాధానం యిచ్చి అక్కడ్నించి వచ్చేశాడు, త్వరత్వరగా

ఆ వాతావరణం, ఒక్కక్షణం భరించడం కూడా కష్టంగా ఉంది మధుకి

సుషమా, సుషమ తండ్రీ కూడా, ఎంతో మోసగాళ్ళుల్లా, కొత్తగావచ్చిన ఆయువకుడు తన అదృష్టాన్ని, తన జీవిత సర్వస్వాన్ని లాక్కుపోతున్న దుర్మార్గుడిలానూ కనిపిస్తున్నా రతనికి

ఇంతకాలం నుంచి, ఇంటాయనమీదున్న సదభిప్రాయమంతా, ఒక్క దెబ్బతో తుడిచిపెట్టుకుపోయింది (ఇంకా వుంది)

# సారధీ స్టుడియోస్‌లో కృష్ణ చిత్రం

ఇంతవరకు నిర్మాతగానే వుంటూ వచ్చిన డూండీశ్వరరావు త్రిమూర్తి ప్రొడక్షన్స్ నిర్మించే రెండవ చిత్రానికి దర్శకుడయ్యారు వారు దర్శకులు కావడం, కృష్ణ చిత్రం సారధీ స్టుడియోస్‌లో ప్రారంభం కావడం, రెండూ గమనార్హమైన విషయాలే జూన్ 11 నుండి 29 వరకు మొదటి షెడ్యూలు కార్యక్రమం అందులో కృష్ణ, వాణిశ్రీ, ఎస్ వరలక్ష్మి, శరత్‌బాబు, మాడా, మున్నగువారు పాల్గొంటారు

తండ్రీ కొడుకులుగా కృష్ణ నటిస్తున్న ఈ చిత్రానికి కె రామలక్ష్మి మాటలను, చక్రవర్తి సంగీతాన్ని, వి యస్ ఆర్ కృష్ణారావు కెమెరాను, కళను మూరన్న నిర్వహించే బాధ్యతలను స్వీకరించారు.



''కొత్తకాపురం''లో

## దొరబాబు

నటి మంజులకు, దొరబాబుకు పెళ్ళి నిశ్చయమయింది పెండ్లి నిశ్చయ మయిందంటే ఇక చెప్పాలా ? ఆడదాని జీవితంలో పెండ్లి అనే సంభవం ఎంతో విలువైనది అందుకే పెండ్లి మాటంటేనే సంబర పడిపోతారు మగువలు అంతవరకు ప్రియుడితో ఫ్రీగా తిరిగినా, పెండ్లి అనేప్పటికి ఎక్కడలేని సిగ్గు, లజ్జ ముంచుకొస్తాయి వధువు మోములో. సిగ్గు పడుతుంటే, వరుడు (ప్రియుడు) వూరుకుంటాడా ! ''పెళ్ళి మాటంటేనే సిగ్గు ముంచుకు వచ్చెనే, మూడు ముళ్ళు పడగానే ఆ ముసుగు తొలగి పోవులే'' అంటూ నటసామ్రాట్ నాగేశ్వరరావు మంజులను ఏడిపిస్తారు ఈ ఘట్టం ఫణి మాధవీ కంబైన్స్‌వారి ''దొరబాబు'' చిత్రంలో కన్పిస్తుంది

ఈ చిత్రంలో దుస్తులకు మాత్రమే లక్ష రూపాయలు ఖర్చు కావడం, గుమ్మడి యం యల్ ఏ గా క్రొత్త తరహా పాత్రను పోషించడం, నటసామ్రాట్ చెల్లెలుగా చంద్రకళ చాలాకాలం తర్వాత నటించడం ప్రత్యేకతలు రాఘవులు సంగీతం, తాతినేని రామారావు దర్శకత్వం, సుబ్బారావు కళా ధర్శకత్వం చేపట్టిన యీ వర్ణ చిత్రానికి రాజేంద్ర ప్రసాద్, సుబ్బారావులు నిర్మాతలు

## తండ్రితో కొడుకు సరసం

హీరో కృష్ణ తన తండ్రితో సరసమాడుతూ ''మామిడి తోటలో మల్లెల వేళలో'' ''సింగారం యెగబోసే బంగారుబొమ్మ చేరవచ్చి మన పెళ్లెపుడండీ'' అంటూ తను ప్రేమించిన పిల్లను గూర్చి తండ్రితో చెప్తాడు. అందుకు తండ్రి సమాధానంగా ''ఒరే సన్నాసి, ప్రేమే ఒక దైవం, పెళ్ళే ఒక యాగం'' అంటూ కొడుకును మందలించాడు. ఈ ఘట్టం త్రిమూర్తి ప్రొడక్షన్స్ వారి రెండవ చిత్రంలో కనిపిస్తుంది. జి. సాంబశివరావు, పి. బాబ్జీ ఈ చిత్రానికి నిర్మాతలు.

## దసరా పండుగ

''జీవితాశయం'' చిత్ర నిర్మాణం పూర్తయింది. ఈ చిత్రం పూర్తి గావడానికి సంవత్సరంన్నర పట్టింది. సప్తగిరి ప్రొడక్షన్స్ అధినేతల ఓపికను, ధైర్యాన్ని మెచ్చుకోవాలి. ఖర్చు అనుకున్న దానికన్నా మూడు రెట్లు ఎక్కువైంది. నిర్మాతలకు ఖర్చు ఏమిటో అన్న నిజం తెలిసివచ్చింది. ఇకమీద జాగ్రత్తగా వుండే అవకాశాన్ని మొదటి చిత్రం నేర్పింది.

''జీవితాశయం'' చిత్రానికి కమలాకర కామేశ్వరరావు దర్శకుడు. ప్రధాన పాత్రలను ఎస్వీ రంగారావు, కృష్ణంరాజు, నాగభూషణం, విజయ నిర్మల, జయంతి, రత్న పోషించారు. మాటలను సముద్రాల, సంగీతాన్ని రాజేశ్వరరావు సమకూర్చారు. ఈ చిత్రం తాలుకు పాటలు మార్కెట్టులో హాట్ కేకుల్లాగా అమ్ముడవుతున్నాయి.

తన రెండవ చిత్రానికి ''దసరా పండుగ'' అని పేరు పెట్టినట్టు, యిది ఈస్ట్‌మన్ కలర్‌లో తయారు కాబోతున్నట్టు నిర్మాణ పర్యవేక్షకుడు శ్రీనివాస్ చెప్పారు. ఈ చిత్రాన్ని నిర్మించే వ్యక్తి పేరు నరశింహస్వామి.

## భారతి

మనోరంజనీ పిక్చర్స్‌వారి ''భారతి'' చిత్రం జూన్ షెడ్యూలుతో దాదాపు పూర్తయినట్టు, నిర్మాత కె వి రెడ్డి చెప్పారు భారతి పాత్రను 'కళాభారతి' పోషించింది రంగస్థల ఆనంద రామయ్యగా రంగారావు నటించారు

ఈ చిత్రానికి వీటూరి కథను, మాటలను, సినిమా అనువాదాన్ని వ్రాయడమే గాక దర్శకత్వాన్ని కూడా చేపట్టారు ఈ మధ్య ''భారతి'' చిత్రం రషస్ చూచినవాళ్ళు లత నటనను మెచ్చుకొన్నారు. లతకు జతగాడు సత్యనారాయణ ఈ చిత్రంలోని పాటలన్నీ మధుర మధురంగా వున్నాయి సంగీత దర్శకుడు కోదండపాణి తన పాటల కొచ్చే పాపులారిటీని వినే అదృష్టానికి నోచుకోలేదే ? ఈ చిత్రంలో పద్మనాభం, రమాప్రభ, చంద్రమోహన్, నిర్మల ముఖ్య పాత్రధారులు కృష్ణంరాజు నాయకుడు.

పై నుంచి దిగువకు
''ధనవంతులు–గుణవంతులు''లో విజయనిర్మల
''రాముని మించిన రాముడు''లో రామారావు
''మాంగల్య భాగ్యం''లో రమాప్రభ

## ఈశ్వరి పద్మనాభం

హాస్య నటుడు పద్మనాభం కుమారుడు చిరంజీవి మురళి ''మాంగల్య భాగ్యం'' పేరిట నిర్మిస్తున్న చిత్రానికి బహుముఖ ప్రజ్ఞావంతురాలు







# సినిమా

భానుమతి గాయకురాలు. ఇందులో పద్మనాభం ద్విపాత్రాభినయం ఒక ప్రత్యేకత. అలాగే రమాప్రభది కూడా అవుతుంది

ఈ మధ్య ఎల్. ఆర్. ఈశ్వరితో కలిసి పద్మనాభం ఒక పాట పాడారు పద్మనాభం ముమ్ముందు తన పాటలను తనే పాడొచ్చు అనిపించింది.

ఆయన పాడిన పాట :

"బ్రాందీ , బాగుందీ
బలే గమ్మత్తుగానే వుంది
మైకం ఎక్కింది
తల తిరగేసి తంతోంది"

దీనిని అప్పలాచార్య వ్రాశారు ముత్తు స్వరం సమకూర్చారు. ఈ ముత్తు స్వర్గీయ కోదండపాణికి కుడి భుజం విద్వత్తు వున్న మనిషి

"మాంగల్య భాగ్యం" చిత్రంలో జగ్గయ్య వుదాత్తమయిన నాయకుడి పాత్రను పోషిస్తున్నారు. శ్రీధర్‌కి యిచ్చిన వేషం చాలా పెద్దది ధనవంతుడి పాత్ర. ఇతర భూమికలను చంద్రమోహన్, ప్రభాకర రెడ్డి, సాక్షి రంగారావు, జయంతి, శుభ, నిర్మల, వెన్నిరాడై నిర్మల, సూర్యకళ ధరిస్తున్నారు

స్త్రీని అబల అనుకుని, ఆమెతో చెలగాట మాడిన ఒక దబ్బాశ పట్టిన వ్యక్తి, జీవితంలో చావు దెబ్బలు తిని చివరకి తను మంగళ సూత్రం కట్టిన ఆమెనే ఆశ్రయించిన వైనమే "మాంగల్య భాగ్యం" కథ. ఈ కథకు అప్పలాచార్య మాటలను సమకూర్చారు

### రాజశ్రీ చెప్పిన కథ

గత వారం ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్‌కి వెళ్ళడం జరిగింది నిర్మాత రాఘవ మా కథ వినండి అని రాజశ్రీని చెప్పమన్నారు

ఆయన కథ చెప్పడం ప్రారంభించారు గంటన్నర సేపు విన్నాను. నేడు సమాజంలో పేరుకు పోయిన నాలుగు వ్యసనాల పర్యవసానం, వాటిని నిర్మూలించే విధానము రాజశ్రీ కథలోని ముఖ్యాంశము అనిపించింది

మంచిని పెంచే పెద్దమనిషి ఒకరయితే, చెడును త్రుంచే వ్యక్తి మరొకరుగా కథను నడిపిస్తారు. దేశాన్ని పీడిస్తున్న జబ్బులు "వ్యభిచారం, దోపిడీతనం, జూదం, లంచగొండితనం." ఈ నాలిగింటినీ సమూలంగా సర్వనాశనం చేసినవాడు దేశం సుభిక్షంగా వుంటుంది అనేది నిరక్షర విజ్ఞాన్ని ప్రచారం చేసే కథయే ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్ యీసారి తీస్తున్నది

"చదువుకున్న ప్రతి మనిషి సంస్కారవంతుడయినవాడు, మోసం పాలు తగ్గుతుంది సంస్కారం పుట్టుకతో అబ్బవలసిన విద్య చదువుతోపాటు అలవడేది కాదు ఈ రెండూ వున్నవాడు సద్వినియోగం చేసి న్యాయాన్ని, ధర్మాన్ని రక్షించగలడు" అనేది నీతిని ప్రబోధించే కథను ఎన్నుకున్నారు, రాఘవ

### రాఘవ పెట్టిన బరువు

ఈ కథతోపాటు మాటలను, పాటలను, సినిమా అనువాదాన్ని చేసే బాధ్యతను రాజశ్రీకి అప్పగించడంతోబాటు దర్శకత్వాన్ని యిచ్చి పెద్ద బరువును పెట్టారు ఈ చిత్రానికి రమేష్ సంగీతాన్ని, మధుసూదన్ ఛాయను నిర్వహిస్తున్నారు. గుమ్మడి, సత్యనారాయణ, రంగనాథ్, జయంతి, శుభ ముఖ్య పాత్రధారులు జులై అయిదున షూటింగు ఆరంభం



"అమ్మమనసు" లో భారతి, చలం

### ఉత్సవం జరిగే స్థలం

శ్రీ లక్ష్మి ప్రొడక్షన్స్ అధినేత పూర్ణచంద్రరావు శోభన్‌బాబు – శారదలను పెట్టి ఈస్ట్‌మన్ కలర్ చిత్రాన్ని నిర్మిస్తున్న వార్త, ఆ చిత్రాన్ని తాతినేని రామారావు డైరెక్ట్ చేస్తున్న విషయం పాఠకులకు తెలుసు.

ఆ చిత్రానికి జాతర జరిగే చోటుగాని, తిరునాళ్ల జరిగే స్థలంగాని, బ్రహ్మ ఉత్సవం జరిగే ప్రదేశముగాని కావాలి. ఎక్కడ జాతర ఘనంగా జరుగుతుందో, ఎక్కడ బ్రహ్మ వుత్సవం బ్రహ్మాండంగా జరుగుతుందో అక్కడికి శోభన్, శారదలను తీసుకుని వచ్చి షూటింగు జరుపుతారట, పూర్ణచంద్రరావు.

### రంగనాథ్ వేగం

"చందన" చిత్రంలో కథానాయకుడి వేషం వేసిన రంగనాథ్‌కి బలే ఛాన్సు తగిలింది మొన్ని మధ్య అతగాడ్ని ఎం ఎస్ రెడ్డిగారి ఆఫీసులో కలి శాను ఉద్యోగానికి రాజీనామా చేశారా అన్నాను చెయ్యాల్సి వచ్చేట్టుంది అన్నాడు అంటే బిజీ అయ్యారన్న మాటేగా అన్నాను "ఏదో, అందరి ఆశీర్వాదబలంతో యిప్పుడు ఎనిమిది చిత్రాలలో నటించే అదృష్టాన్ని అందుకున్నాను" అన్నాడు రాజమండ్రి రంగనాథ్.

### వెంకటరమణా పిక్చర్స్

గుడివాడ వాస్తవ్యులు నిర్మించే చిత్రానికి దర్శకుడు పి. చంద్రశేఖరరెడ్డి తనకని వ్రాసుకున్న 'జన్మ జన్మల బంధం" కథను యిచ్చారు ముకుటాన్ని చదివితే, యీ కథ యిద్దరి ప్రేమికుల రెండు జన్మలకు సంబంధించిన కథ అన్న నిజం అర్థమవుతుంది

గాఢానురాగబద్ధు లయిన ప్రేయసీ ప్రియులుగా వాణిశ్రీ, కృష్ణ నటించే యీ చిత్రం ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిత మవుతుంది. ఈ చిత్రానికి మహారధి మాటలను వ్రాస్తున్నారు. సంగీతాన్ని మహదేవన్, కళను చలం, పాటలను ఆత్రేయ, నిర్మాణ నిర్వహణను సి. హెచ్. వెంకట్రావు చేపట్టారు.

ముఖ్య పాత్రలను గుమ్మడి, సత్యనారాయణ, రాజబాబు, రమాప్రభ పోషిస్తారు. ఆగస్టు నుండి షూటింగు ఆరంభం.

### దీర్ఘసుమంగళి

ఇటీవల గోపాలకృష్ణా ప్రొడక్షన్స్ వారు నిర్మిస్తున్న "దీర్ఘసుమంగళి" సెట్‌లో నటి జమునను కలిసాను. 'హలో! జమునగారూ! ఏమిటి యింత హఠాత్తుగా దర్శకురాలు కావాలన్న కోరిక కలిగింది?' అని ప్రశ్నించాను. అందుకావిడ యిలా సమాధానమిచ్చింది. 'ఇరవై రెండేళ్ల నా నట జీవితంలో ఇంతవరకు నాకలాంటి ఆలోచనే రాలేదు. కానీ "అరుణ" నవలను చదివినప్పుడు ఎందుకో ఆ చిత్రానికి నేనే దర్శకత్వం వహిస్తే బాగుంటుంది అన్పించింది ' ఈ చిత్రం తాలూకూ షూటింగు ఆంధ్రప్రదేశ్‌లో జరుగుతుందని, చిత్రం విజయ దశమినాడు ఆరంభమౌతుందని జమున చెప్పింది ప్రతి వ్యక్తి జీవితంలో ఓ మలుపుగాని, మార్పుగాని రావడానికి ఎవరోవొకరు కారణంగానూ లేక ఏదో ఒక ఇన్‌స్పిరేషన్ కలగడంగాని జరుగుతుంటుంది. నటి జమున విషయంలో "అరుణ" నవల ఆవిడ జీవితంలో క్రొత్త అధ్యాయాన్ని సృష్టించింది

### సౌందర్య పోషణ

పరిశ్రమకు వచ్చి రెండు దశాబ్దాలు దాటినా వచ్చినపుడు ఎలా గ్లామరస్‌గా వుండేదో, ఇప్పుడూ అలాగే వుంది జమున అందుకు కారణం సౌందర్యం పట్ల ఆవిడ తీసుకునే శ్రద్ధానక్తులే. కొన్నేండ్లుగా దేహ సౌందర్యాన్ని కాపాడుకొంటూ వచ్చే జమునను నిజంగా అభినందించాలి

### నచ్చిన నాలుగు

ప్రస్తుతం తను నటించే చిత్రాల్లో తనకు నచ్చిన, ప్రజలు మెచ్చుకుంటారు అని నమ్మే పాత్రలు

నాలుగు అంది జమున "దీర్ఘ సుమంగళి—ఇందులో జీవిత సూత్రాలకు ప్రాధాన్యత నిచ్చే భర్తకు ఈడైన భార్యగా, భర్తే దైవంగా కొలిచి, చివరకు కన్న పిల్లలను గూడా ఇంటి నుంచి వెళ్ళగొట్టే వుత్తమ ఇల్లాలుగా నటిస్తున్నాను "వనజ — గిరిజ" ఈ చిత్రంలో ద్విపాత్రాభినయం ఒక జన్మలో రామకృష్ణకు జతగా, మరొక జన్మలో సత్యనారాయణకు జోడీగా నటిస్తున్నాను విభిన్న మనస్తత్వాలు గొన్న రెండు పాత్రలు నాకు బాగా తృప్తి నిచ్చాయి 'యశోదా కృష్ణ' అందులో యశోదగా నా శక్తిమేరకు నటించడానికి ప్రయత్నిస్తున్నాను ఎన్నాళ్ళగానో వెయ్యాలనుకొన్న పాత్ర దొరికింది దొరికిన పాత్రను నలుగురికీ నచ్చేవిధంగా నటించాలని నా ఆశ "అరుణ"లో టైటిల్ పాత్ర ఎలా నటించానని, ఎలా నిర్దేశకత్వం వహించాననేది మీరు, పాఠకులు చెపుతారుగా" అని తన సంభాషణం ముగించింది.

## దత్తత తీసుకున్నాడు చలం

ఎవర్ని? రవి అనే బుల్లెబ్బాయిని అందుకు కారణం ఏమిటి? రవి చెప్పిన కొన్ని నెంబర్ల కలయికవల్ల జాక్‌పాట్ కొట్టాడు చలం అందుకే జాక్‌పాట్‌లో ఆరులక్ష లొస్తే, మూడు లక్షలు రవి పేరిట వేసి, దత్తత తీసుకున్నాడు. ఇదంతా నిజంకాదుసుమా విజయలక్ష్మి మూవీస్ వారి "అమ్మ మనసు" చిత్రంలోనిది

చలం ఓ బాల విహార్‌లో వార్డు బాయ్‌గా పని చేస్తుంటాడు. బాల విహార్‌లోని పిల్లలతో నవ్వుతూ, నవ్విస్తూ, మంచి బుద్ధులు నేర్పిస్తూ, వారిలో ఒకడుగా జీవిస్తుంటాడు. అనుకోకుండా ఓ రోజు జాక్‌పాట్ కొట్టాడు. అందుకు నిదర్శనంగా క్రొత్త ఇల్లు, కారు కొనుక్కున్నాడు. విజయ అనే అమ్మాయిని పెండ్లి చేసుకున్నాడు. బాల విహార్ నుంచి తాను దూరంగా వెళ్లిపోయినా, ప్రతిదినం బాల విహార్‌కు రావడం, పిల్లలతో కల్సి ఆడుకోవడం, పాడుకోవడం తన దైనందిన కార్యక్రమాల్లో ఒకటిగా పెట్టుకున్నాడు పిల్లలంటే అతనికెంత ప్రాణమో, యితనంటే వాళ్ళ కంతకంత ప్రాణం నడమంత్రపు సిరికి పులికిపడలేదు మంచి వాడు అన్న పట్టాన్ని పోగొట్టుకోలేదు చలం.



"సత్యానికి సంకెళ్ళు"లో వాణిశ్రీ

"అమ్మ మనసు" చిత్రానికి జి వి ఎస్ రాజు నిర్మాత కె విశ్వనాథ్ దర్శకుడు మహదేవన్ సంగీత దర్శకుడు భారతి, జయంతి, సత్యనారాయణ, కె విజయ తదితరులు ముఖ్య పాత్రధారులు

## హారతి

కృష్ణంరాజు, భారతి ప్రేమించుకున్నారు కొందరిలా ప్రేమించుకోవడం, ఆ ప్రేమ కైపు తగ్గిపోగానే మరో వైపు ప్రేమను మళ్లించడంలా కాకుండా, పవిత్రంగా ప్రేమించుకొని, ఒకర్ని ఒకరు విడచి వుండలేనంతగా అనురాగబద్ధు లయ్యారు కృష్ణంరాజు, భారతి

పాటతో మొదలెట్టారు ప్రేమాయణాన్ని

"ఎప్పుడూ నిన్నే ఈలాగే చూడాలి,
చప్పుడు చేయని నీ కనురెప్పల
సరిగమలే వినాలి, వినాలి" అంటూ

ఒండొరుల భావాలను చెప్పుకున్నారు కృష్ణంరాజు, భారతి చక్రవర్తి కూర్చిన బాణీకి అనువుగా పాడారు బాలు, సుశీల ఇంతకీ ఈ పాట ఎందులో? దేవి ప్రియదర్శిని పిక్చర్స్ నిర్మించే "హారతి" చిత్రంలో.

హారతిగా ఊర్వశి శారద నటిస్తోంది హరించుకు పోయిన మనస్సుల్లో ఆనంద వర్షాన్ని కురిపించిన అమృతమూర్తిగా నటిస్తోంది శారద కృష్ణంరాజు తండ్రిగా జగ్గయ్య, తల్లిగా పుష్పలత నటించే ఈ చిత్రంలో నాగభూషణం, రాజబాబు, పద్మనాభం, అల్లు రామలింగయ్య, రమాప్రభ, నిర్మల, బేబీరోహిణి ముఖ్య పాత్రధారులు.

మాటలను గోపి, ఛాయను శేఖర్ – సింగ్, కళను బి యన్. కృష్ణ, నిర్వహించే ఈ చిత్రానికి యం చంద్రశేఖర్, బండి కృష్ణారావు నిర్మాతలు లక్ష్మీదీపక్ దర్శకుడు

## ప్రేమ గుడ్డది

ప్రపంచంలో ఆడ, మగ యిద్దరూ తమ అందరికి అందమైన వరుడు లేక వధువు కావాలనుకుంటే, అందరికి ధనవంతులైన వరుడు లేక వధువు కావాలనుకుంటే, అందరికి వుద్యోగస్తులు, పలుకుబడి వున్నవారే కావాలనుకుంటే, ఇవన్నీ లేనివారి గతి ఏమిటి? వాళ్ళలాగే పెండ్లి పెటాకులు లేకుండా వుండిపోవాల్సిందేనా! అందుకే భగవంతుడు మనుష్యుల్లో "ప్రేమ" అనే తియ్యటి మత్తు పదార్థాన్ని చిలకరించాడు ప్రేమించే మనస్సుకు డబ్బు, పేదరికం, హోదా, అందం ఇవన్నీ అతీతమైనవి ధనవంతురాలు విజయనిర్మల, పేద



"వనజ—గిరిజ"లో భవాని, చంద్రమోహన్

వాడు కృష్ణను ప్రేమించింది పెళ్ళి చేసుకోవడానికి నిశ్చయించుకొంది తారతమ్యాలు ఆలోచించకుండా తప్పటడుగు వెయ్యకూడదని ఆలోచించినా, వలచి వచ్చిన విమల మనస్సు కాదనలేకపోయాడు కృష్ణ ఇద్దరూ భావోద్రేకంతో యిలా పాడుకున్నారు

"నడిచే కవితవు నీవై
నవ్వే నవతవు నీవై,
నా వూహాలనిండా వున్నావు
నా వూపిరి నీవై వున్నావు"

బాలు, సుశీల పాడిన ఈ పాటకు పెండ్యాల దేవి ఆర్ట్స్ వారి "ధనవంతులు—గుణవంతులు" చిత్రానికి గామా సంగీతం సమకూర్చారు ఈ చిత్రానికి కె వరప్రసాదరావు దర్శకుడు నిర్మాత వజ్జె పూర్ణచంద్రరావు సమర్పణ వజ్జె నాగేశ్వరరావు

## హాస్య జంటగా రమాప్రభ - పద్మనాభం

ఏకాంతం దొరికితేచాలు అమాంతంగా ముంచుకొస్తుంది భార్యాభర్తల్లో సరసం ఎవరికి తెలిసిన బాషలో వారు మాటలాడుకోవడం మాటలు చాలవనుకుంటే పాటల్లోకి దిగడం, ఇవన్నీ సర్వసాధారణం. పాటంటే ఏమిటో తెలియని వ్యక్తికి గూడా పెళ్ళాం మాత్రం ప్రక్కనున్నపుడు ప్రవాహంలా దొర్లుతాయి మాటలు పద్మనాభం రమాప్రభలకు ఏకాంతం చిక్కింది అందుకే "ఓ రంగుల రామచిలకా — ఇటు రావే బంగరుగిలకా' అని అతనంటే, "ఓ బూటకాల బుల్లోడా - ఏందయ్యా నీ గొడవ" అని ఆమె పాడడం జరిగింది ప్రసన్నలక్ష్మి పిక్చర్స్‌వారి "కొత్తకాపురం' చిత్రంలో

కృష్ణ, యస్వీ రంగారావు, చంద్రమోహన్ అల్లు రామలింగయ్య, రాజబాల, జగ్గారావు, భారతి కృష్ణకుమారి, సూర్యకాంతం, అనిత, హేమల ముఖ్య పాత్రధారులైన ఈ చిత్రానికి మాటల

బొల్లిముంత శివరామకృష్ణ, సంగీతం కె వి. మహాదేవన్, ఆర్టు బి చలం — జి వెంకటరత్నం నిర్మించే ఈ చిత్రానికి స్క్రీన్‌ప్లే — దర్శకత్వం పి సి రెడ్డి చిత్రం ఇప్పటికి పదిరీళ్లు అయింది. జులైలో నాలుగు పాటల చిత్రీకరణ జరుగుతుంది.

## కృష్ణకు తెరపై కొత్త జతగాడు

చనువు వున్నవాళ్లు కృష్ణకుమారిని ముద్దుగా 'కృష్ణ' అని పిలుస్తారు ఇటీవల ఆమెను సురేష్ మూవీస్ వారి వర్ణ చిత్రం "చక్రవాకం" సెట్లో కలిశాను ఆమెలో యవ్వనపు ఛాయలు అట్లాగే అగుపించాయి ఇంకా 'కుల గోత్రాలు' నాటి కృష్ణగానే కనిపించింది ఆమె హీరో లందరి సరసన ఎన్నో చిత్రాలలో నటించి వాళ్లకు దీటుగా నిలబడిన నిజాన్ని ఎవరూ కాదనలేరు అట్టి కృష్ణకుమారి స్వయంకృతాపరాధం వల్ల పరిశ్రమలో తనకున్న పలుకుబడిని, ప్రజలలో తనకున్న పాపులారిటీని కోల్పోయింది

"చక్రవాకం"లో కృష్ణకు కొత్త జతగాడు దొరికాడు అతడెవరయ్యా అంటే సురేష్ రామానాయుడే ఇద్దరికీ జత చక్కగా కుదిరింది ఇదే చిత్రంలో శోభన్ — వాణిశ్రీ ఒక జంటగా, పద్మనాభం — రాజసులోచన మరొక జంటగా నటిస్తున్నారు ప్రధాన భూమికలను ఎస్వీ రంగారావు, నాగభూషణం, రా జ బా బు, అల్లు రామలింగయ్య, శ్రీధర్, చంద్రకళ, జి వరలక్ష్మి ధరిస్తున్నారు. ఈ చిత్రానికి విక్టరీ మధుసూదనరావు దర్శకుడు. ఆయనకు తోడుగా మార్కస్ బారట్లే, మహదేవన్ ఛాయా సంగీతాలను చేపట్టారు తెలుగులో నిర్మిత మవుతున్న కాస్ట్లీ చిత్రాలలో యిది ఒకటి

## ప్రత్యగాత్మ చిత్రంలో కొత్త జంట

సత్యాఎంటర్‌ప్రైసెస్ నిర్మిస్తున్న కొత్త కలర్ చిత్రం షూటింగు కాళహస్తి దగ్గరున్న ఒక పల్లెలో ప్రారంభమైంది ఇందులో కథానాయకుడి పాత్రను విష్ణువర్ధన్, నాయికగా జయసుధ నటిస్తున్నారు ఒక వుదాత్తమైన భూమికలో కృష్ణ కుమారి కనిపిస్తుంది దుష్టుడిగా గిరిబాబు గమ్మత్తయిన వేషాన్ని చేపట్టాడు ఈ చిత్రాన్ని చిరంజీవి వాసు నిర్మిస్తున్నారు

## నృత్య పోటీలో నెగ్గిందెవరు ?

ఇటీవల కుమారి శ్రీవిద్య, కుమారి "యుషికో" నృత్యంలో పోటీపడ్డారు భారతీయ నృత్య ప్రాభవాన్ని బహు చక్కగా, భావయుక్తంగా అభినయించింది శ్రీవిద్య నడుము వూపులతో, కైపెక్కించే చూపులతో పాశ్చాత్య నృత్యాన్ని చేసింది కుమారి యుషికో నృత్యాన్ని తిలకించడానికి వచ్చిన వారందరికి యుషికో నృత్యమే నచ్చింది శ్రీవిద్య పోటీలో తల వొంచింది కానీ అలా జరగడానికి వీల్లేదు పాశ్చాత్యనృత్యాలకు దాసోహం అన్న స్వదేశీయుల నుద్దేశించి, ప్రాచీన భారతీయ కళా వైభవాన్ని జ్ఞప్తికి తెస్తూ ప్రేక్షకులలోంచి ఓ వ్యక్తి ఇలా భావోద్రేకంతో పాడడం మొదలెట్టాడు. ఎవరో





"చిన్ననాటి కలలు"లో ప్రమీల, కృష్ణంరాజు

కాదు ఆ వ్యక్తి మిలిటరీ మేజర్ ఎన్ టి రామారావే "ఇదేనా మన నీతి, ఇదేనా మన ఖ్యాతి" అంటూ హృదయాలలో మూగపోయివున్న భారతీయ సభ్యత, సంస్కారం, కళాభిరుచి, కళా ప్రతిభలను ఒక్కసారిగా తన వుద్రేకపూరితమైన పాటతో కదలించారు నందమూరి అంతవరకు పొరుగింటి పుల్లకూర రుచి అని భ్రమపడ్డ భారతీయులు మగత నిద్ర నుంచి మేల్కొన్నారు పై సంఘటన రాజేశ్వరీ ఫైన్ ఆర్ట్సు బ్యానర్ క్రింద యన్ భక్తవత్సలం, యం యస్ గోపీనాథ్ నిర్మించే "రాముని మించిన రాముడు" చిత్రంలో చూడొచ్చు

యం యస్ గోపీనాథ్ దర్శకత్వం వహిస్తున్న ఈ చిత్రానికి డి వి నరసరాజు మాటలను,

"రాధమ్మ పెళ్లి"లో ఒక దృశ్యం



టి. చలపతిరావు సంగీతాన్ని, బి. ఏ కృష్ణ కళను జి. కె రాము ఛాయను నిర్వహిస్తున్నారు

నటరత్న ద్విపాత్రాభినయం ప్రత్యేకాకర్షణగా ఈ చిత్రంలో త్యాగరాజు, రామదాసు, ముప్పగువారు ప్రధాన పాత్రధారులు

## డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ !

ఈ సంస్థ యిప్పటికి ఆరు మంచి చిత్రాలను నిర్మించింది అయిదు జనాకర్షణీయంగా నిర్మితమయినాయి అంటే ఎవరికీ అభ్యంతరం వుండదనుకుంటా సభ్యత వున్న చిత్రాలను తీసే కొద్ది సంస్థలలో యిదొకటి దీనికి డి వి ఎస్ రాజు అధినేత

డి వి ఎస్ రాజు నిర్మిస్తున్న ఏడవ చిత్రం షూటింగు ఆగస్టులో ఆరంభ మవుతుంది ఇది రంగుల చిత్రం ఈ చిత్రానికి ప్రముఖ రచయిత్రి రామలక్ష్మి కథ నిచ్చింది ఆ కథకు సముద్రాల మాటలను రచించారు జులై నెలలో డాక్టర్ నారాయణరెడ్డి, కొసరాజు రాసిన పాటలకు సంగీత సారథి మహదేవన్ బాణీలు సమకూరుస్తారు కళకు కళాధర్, ఛాయకు జి కె రాము దర్శకులు

### శోభన్ - వాణిశ్రీ

డి వి ఎస్ నిర్మించే ఈ చిత్రంలో శోభన్‌బాబు, వాణిశ్రీ ప్రధాన జంటగా నటిస్తున్నారు ఇతర ముఖ్య పాత్రలను సత్యనారాయణ, శుభ, రాజబాబు, రమాప్రభ, అల్లు రామలింగయ్య పోషిస్తున్నారు ఈ చిత్రానికి సినిమా అనువాదాన్ని, దర్శకత్వాన్ని కాశీనాధుని విశ్వనాథ్ చేస్తున్నారు

ఈ చిత్రం తాలుకు అవుట్‌డోర్ దృశ్యాలు వూటీలో చిత్రీకరించడానికి నిర్మాత డి వి ఎస్ రాజు నిర్ణయించారు

## ఉద్యోగం దొరికింది !

మన దేశంలో డిగ్రీ వుండికూడాఎందరికో వుద్యోగాలు లేవు అన్న నిజాన్ని ఎవరూ కాదనలేరు మగవాళ్ల కంటె ఆడవాళ్లే ఎక్కువగా వుద్యోగాలు చేస్తున్నారు

నిరుద్యోగి కాంతారావును, అతడి భార్య జయంతి తనకొచ్చే డబ్బుతో పోషిస్తూ వచ్చింది డిగ్రీ చేతబట్టుకుని వుద్యోగం కోసం ఎన్నో ఆఫీసులను ఎక్కి దిగాడు కానీ, కాంతారావుకు పని దొరకలేదు

ఇక వుద్యోగం దొరికే అదృష్టం లేదనుకున్నాడేమో, టాక్సీ డ్రైవరుగా చేరాడు తన భార్యను సమీపించాడు నాకు కూడా సంపాదించే మంచి రోజు వచ్చింది అంటూ భార్యను మురిపించాడు

"తియ్యని ఒక మాట వినిపించనా

తేనెలు నీలో కురిపించనా" అని ఆమె బుగ్గ నిమిరాడు "కట్" అన్నారు దర్శకుడు రామిరెడ్డి ఈ రసమయ దృశ్యం లలితా మూవీస్‌వారి కొత్త చిత్రంలో కనిపిస్తుంది ఈ చిత్రానికి జి జగదీష్ చంద్రప్రసాద్ నిర్మాత దీనికి దుక్కిపాటి మధుసూదనరావు కథను యిచ్చారు మాటలను గొల్లపూడి, సంగీతాన్ని రాజేశ్వరరావు, ఛాయను సెల్వరాజ్,

(30 వ పేజీ చూడండి)

అర్ధరాత్రి దాటిపోయింది.

చిక్కని చీకటిని కప్పుకున్న ఆ పల్లెలో వీధి దీపాల కాంతి ఆ చీకటి ముందు గుడ్డివెలుగులా పరచుకుంది. నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ మధ్య మధ్య కుక్కలు అరుస్తున్నాయి.

# అన్నపూర్ణ

## - ఆకోటి నాగమణి -



వీధి వరండాలో పడుకున్న రావు, నిద్ర కళ్ళం తాను చేస్తున్న ప్రయత్నాన్ని విరమించుకొని లేచి కూర్చున్నాడు. గుండెల్లో ఏదో బాధ, ఆవేదన అతనిని నిద్రాదేవికి దూరం చేసాయి. ఆలోచనలు అతని నెందుకో ఓ విధమైన బలహీనతకు లోనుచేసి భయపెడుతున్నాయి.

"భాను తనకు దూరంగా వెళ్ళిపోతుందా?" అన్న ప్రశ్న వెనుకే వచ్చిన సమాధానం అతనిని నిలువునా వణికించింది,

"ఊహూం... లేదు... భాను ఎప్పుడు అలా చేయదు. భాను అన్నపూర్ణలా తనకు దూరంగా వెళ్ళిపోదు. పోలేదు." అని అనుకుంటున్న అతనికి, అన్నపూర్ణతోపాటు, భాను అన్నపూర్ణ కోడలన్న విషయం గుర్తుకు వచ్చింది.

అతనిక మంచం మీద కూర్చోలేనట్టుగా లేచి, భాను గదిలోకి వెళ్ళాడు. భాను ప్రశాంతంగా నిద్ర పోతున్నట్టు కన్పింపడంతో, తిరిగి బయటికి వచ్చాడు.

"తను అనవసరంగా బాధ పడుతున్నాడు. అతిగా ఆలోచించి, గాబరా పడుతున్నాడు. కాని... భాను అన్నపూర్ణలా తనను అన్యాయం చేసి వెళ్ళిపోదు. ఎందుకు పోతుంది? తనను వొదిలి భాను వుండగలదా?"

"ఉండగలదు! నిన్నేకాదు, మరెవ్వరినైనా వదిలి వెళ్ళగలదు. ఎందుకో తెలుసా?... భాను అన్నపూర్ణ కోడలు! అన్నపూర్ణ కోడలుగానే మిగులుతుంది! ప్రతి మాటలో ప్రతి క్షణం నీ కళ్ళకు అన్నపూర్ణలా అన్పించిన భాను... ఈనాడు - అన్నపూర్ణ అడుగుల్లో మాత్రం ఎందుకు నడవ లేదూ? మనసులోని ఏ మూలో కదులుతున్న ప్రశ్నలు సముద్రపు ఘోషలా రావు చెవులను తాకాయి.

"లేదు... వీల్లేదు. అలా జరగడానికి వీల్లేదు. నేను జరగనివ్వను." రావు మాటలకు సమాధానంగా నిశ్శబ్దం నవ్వింది వీస్తున్నచల్లగాలి, జాలిగా వొళ్ళుని మిరిపోతుంటె, "మరి చంద్రం ఎందుకు వచ్చాడూ?" అంది మనస్సు.

"చంద్రం... అవును చంద్రం ఎందుకు వచ్చాడూ?" తనను తానే ప్రశ్నించుకుంటూ, ఆలోచిస్తున్న రావు హఠాత్తుగా ఏదో గుర్తుకు రావడంతో, వరండాకు ఎడమవైపున్న గది తలుపులు తోసుకొని వెళ్ళాడు.

గదిలో మంచం మీద, ఓ ప్రక్కకు వొత్తిగిల్లి నిద్రపోతున్నాడు చంద్రం! ప్రశాంతంగా నిద్ర పోతున్న, చంద్రం మొహంలో నిండిన నిర్మలత్వాన్ని చూస్తున్న రావుకు, చంద్రం ఆ క్షణంలో భానును తన నుండి దూరంగా లాక్కువెళ్ళే రాక్షసుడిలా కన్పించాడు! కొన్ని గంటల క్రితం, చంద్రం అతని కళ్ళకు ఎంతో నిండుగా, హుందాగా, ఆరడుగుల అందమైన విగ్రహంలా కన్పించాడు. మాటల్లో కన్పించే మృదుత్వం, వినయం, కళ్ళలో కదిలే ఆకర్షణ ఎంతగానో ఆకర్షించాయి. కాని... యిప్పుడు అవి భయపెడుతున్నాయి.

ముఖ్యంగా భాను అన్న మాటలు —

"నా రాక నీకు ఇబ్బందిగా వుంది కదూ భామా! నేను రాకుండా వుంటేనే బావుండేదేమో!"

అన్న చంద్రం మాటలకు నవ్వుతూ – "బహుశా నిన్ను చూపించే అవకాశం నాకుండదేమో చంద్రం! ఎందుకంటె పదేళ్ళు కావొస్తున్నా అత్తయ్యను చూడాలనుకొని ." ఆ తరువాత ఆలోచించలేక పోయాడు రావు

అవును. పదేళ్ళ క్రితం . అన్నపూర్ణ యింట్లో నుంచి శాశ్వతంగా, తనకు దూరంగా వెళ్ళిపోయింది కాని భాను మాటల్లో .చంద్రాన్ని తనకు చూపించే అవకాశం తనకిక వుండదని చెప్ప డంలో భాను ఉద్దేశ్యం ??

"భాను! నా మేనకోడలు" ఒకనాటి అన్నపూర్ణ మాట చెవుల్లో హోరెత్తిపోసాగింది ఎక్కడలేని నిస్సత్తువ రావును ఆవహించుకోవడంతో మౌనంగా చంద్రం గదిలో నుండి బయటికి వచ్చి, తన మంచం మీద కూర్చున్నాడు ఎంతో గంభీరం, హుందా తనం చోటు చేసుకునే రావులో ఆ క్షణం ఏదో బెంగ . బాధ నిండిపోయాయి ఆ క్షణంలో తన లాగే కాక యింకా చాలా విషయాల గురించి భాను ఆలోచిస్తుందని రావుకు తెలీదు.

## 2

"అత్తయ్యా!" గావుకేక పెడుతూ వంటింట్లోకి తుఫానులా వచ్చింది తొమ్మిదేళ్ళ భాను.

"మాష్టారూ వచ్చారత్తయ్యా! చూడవూ!" అంది. వంట చేస్తున్న అన్నపూర్ణ మాట్లాడ లేదు

"మీ మాష్టారొస్తే నువ్వు యిక్కడ చేరావేం ?" అంది అక్కడే కూర్చున్న సత్య

బిక్కమొహం వేసిన భాను అన్నపూర్ణ భుజా లను వెనకనుండి చుట్టేస్తూ మెల్లిగా చెప్పింది – "మరే... మొన్న నన్ను మెచ్చుకున్నారని "

"ఆహా . మెచ్చుకుంటె మెచ్చుకున్నాడులే" అంది సత్య.

"నేను నీకు చెప్పడంలేదు." అంది భాను కోపంగా

"సత్యా! కాఫీ చేయాల్సి వుంటుందేమో! వీరయ్యను పాలు త్వరగా తీయమని చెప్పు" అంటూ, సత్యను పంపించి, భూజాలమీద వాలిన భానును వొళ్ళోకి తీసుకుంది.

"అత్తయ్య! నాన్న కాఫీ తెమ్మంటె నువ్వే తీసుకురా అప్పుడు మాష్టారును "

"ష్. సత్య వస్తోంది ఊరుకో భాను" అంటూ నవ్వి, "కాఫీ రుక్కు తీసుకొస్తుంది కాని, నేను మీ మాష్టారును చూడ్డం ఏమిటి ?" అంది

"అంటె ?"

"ఎందుకు చూడాలి ? మీలా నేనేం ఆయన దగ్గర చదువుకోవడం లేదుగా "

"మంచి మాష్టారని చెప్పానుగా! మంచివాళ్ళని చూడాలన్పించదూ ?"

"ఊహూ!" అంటూ భాను తల నిమురుతూ "యిందాకే నేను చూసాగా" అంది అన్నపూర్ణ అబద్ధం ఆడేస్తూ

"ఎప్పుడూ ?" భాను సూటిగా అడగడంతో తడబడిపోయింది అన్నపూర్ణ.

"ఇందాకా. నేను రుక్కును పిలవాలని వెళ్ళానా అప్పుడు" అంది

"ఆయనే మా మాష్టారని నీకెలా తెలుసు ?"

"రుక్కు చెప్పింది ."

"అబద్ధం చెబుతున్నావు కదూ అత్తయ్యా!" అంది భాను.

"ఏయ్ భానూ! అత్తయ్యను విసిగించకు వెళ్ళు" అంది తిరిగివచ్చిన సత్య

భాను పసి హృదయం పడే ఆరాటం అర్థం చేసుకున్న అన్నపూర్ణ. "భానూ ? అక్కడ నాన్నగా రుంటారు కదూ! మరోసారి ఎప్పుడైనా చూస్తాను నిజంగా మీ మాష్టారు చాలా మంచివారు చూడా లని నాకు వుంది" అంటూ భానును బుజ్జగించి పంపించేసింది అన్నపూర్ణ

"అత్తయ్యా! నువ్విలా మంచిగా చెబితే రేపు నాన్నముందే అడుగుతుంది" అంది సత్య

"మాష్టారు ప్రతి రోజూ మనింటికి వస్తాడా ఏమిటే సత్యా! అయినా భాను చిన్నపిల్ల కసిరితే ఏడ్చి రాద్ధాంతం చేస్తుంది అప్పుడు అన్నయ్యకు తెలీదూ ? తరువాత నేను నచ్చచెబుతాలే!" అంది అన్నపూర్ణ.

కాని ఆ రాత్రి భోజనాల సమయంలో రావు అన్నపూర్ణతో చెప్పాడు. —

"పూర్ణా! యిందాకా భాను మాష్టారు పురుషోత్తమరావు వచ్చాడు కుర్రాడే అయినా మంచి తెలివిగలవాడు. మంచివాడు వెనకాముం దెవ్వరూ లేరట మన పాత యిల్లు కావాలన్నాడు కరణం కూడా వచ్చి మరీ మరీ చెప్పడంతో సరే నన్నాను" అన్నాడు

"యిల్లు అంతా పడిపోయింది కదూ అన్నయ్యా!"

"ఆఁ . రెండు గదులు బావున్నాయి. ఒక్కడే కదూ, సరిపోతుంది ఆఁ. అన్నట్టు మన పిల్ల లకు ప్రయివేటు చెబుతానన్నాడు వెధవది రెండు గదులకు అద్దె అడగడం ఏం బావుంటుంది ? అందుకే వద్దన్నాను సాయంత్రం పూట ఓ గంట ట్యూషన్ చెబుతానన్నాడు." అన్నాడు రావు

"ఆ రెండు గదులను కూడా కాస్త బాగు చేయించి యిద్దాం నాన్నా ?" అంది భాను ఉత్సా హంగా.

"ఆఁ . వరండా లోగిలి కాస్త తుడిపించి, బావి దగ్గర కాస్త గచ్చు వేయించి యిస్తే సరి పోతుంది" అన్నాడు రావు.

"నువ్వేమంటావ్ పూర్ణా! ఇవ్వమంటావా ? నీ యిష్టం"

"అదేమిటన్నయ్యా అలా అడుగుతావు యిల్లు నాదేనేనా ?" అంది అన్నపూర్ణ

"అబ్బే . అది కాదమ్మా!" అంటూ నవ్వే సాడు

"మాష్టారుతో సరేనని, మళ్ళీ నీ యిష్టం అని అడిగాడేం అత్తయ్యా, నాన్న ? ఇప్పుడు నీ కిష్టం లేకపోతే, మాష్టారుతో కాదంటాడా ?" అంది భాను

అన్నపూర్ణ చిన్నగా నవ్వి, భాను వీపు నిమ రుతూ – "పెద్దవాళ్ళు మాట్లాడితే తప్పులు ఎన్నకూడదమ్మా!" అంది

"పెద్దవాళ్ళయితే తప్పులు మాట్లాడవచ్చా!"

"కూడదు. కాని చిన్నవాళ్ళు ఆ తప్పును ఎత్తి చూపితే కోపం వస్తుంది."

"ఎందుకు ? పెద్దవాళ్ళయితే తప్పులు మాట్లాడకూడదని తెలీదూ?" అన్న భాను ప్రశ్నకు



### అమెరికాలో ఉగాది

అమెరికాలోని రివర్‌డేల్ లో తెలుగు నాటక కళా సమితి వారు ఉగాది ఉత్సవాలను జరుపుకున్నారు ఆ సందర్భంగా శ్రీ కె. ఎస్. కె. వెంకటేశ్వర్లు రాసిన 'సుందరీ కాండ' నాటకాన్ని శ్రీ మొదలి బ్రహ్మానంద శర్మ దర్శకత్వంలో ప్రదర్శించారు శ్రీయుతులు మొదలి బ్రహ్మానందశర్మ, తమ్మర శేష గిరిరావు, తమ్మవరపు నరసింహారావు, నిభానుపూడి జగన్నాధరావుగార్లని చిత్రంలో చూడవచ్చు నాటకం లోని ఈ దృశ్యాన్ని డాక్టర్ శర్మ, బి. మొదలి పంపించారు.

వెంటనే ఏం సమాధానం చెప్పాలో తెలీక మౌనం వహించింది అన్నపూర్ణ.

"భానూ! నాన్న తప్పుగా మాట్లాడలేదమ్మా! నేను పరేనంటానని నాన్నకు తెలుసు! అందుకే మాష్టారుతో అలా చెప్పారు. ప్రతి విషయం నాతో చెబుతారుగా! అలాగే ఇదీ చెప్పారు" అంది.

మరో రెండు రోజులకు పురుషోత్తం, రావు పాత యింట్లో ప్రవేశించాడు. యిల్లు అంతా మరామత్తు చేయించాడు రావు.

"అన్నయ్యా! స్కూల్‌కు వెళ్ళకుండా, సత్య చదువు రాకుండా చేసుకుంది. ఎలాగూ మాష్టారు యింటికి వచ్చి చెబుతారుగా సత్యనుకూడా చదివిస్తే బావుంటుందేమో!" అన్న అన్నపూర్ణ మాటలకు, రావు ఆలోచించాడు.

అతనికున్న నలుగురు కూతుళ్ళలో శ్రద్ధగా చదువుకొని మంచిమార్కులు సంపాదించేది ఒక్క భాను మాత్రమే రాధ కాస్త ఫర్వాలేదన్నట్టు చదువుతుంది. యిక రెండో అమ్మాయి రుక్మిణి అంతంతగానే చదువుకుంటుంది. సత్య కసలు చదువే అబ్బలేదు.

రావు భార్య మహాలక్ష్మి ఎప్పుడు ఏదో జబ్బుతో బాధ పడుతూ వుండేది. పైగా ముగ్గురు ఆడపిల్లలను కన్న తరువాత ఆమె ఆరోగ్యం చాలా దెబ్బ తింది. ఆమె మరీ బలహీనంగా వున్నప్పుడు పుట్టినందుకేమో నాలుగో అమ్మాయి భాను సన్నగా, బలహీనంగా, పుట్టింది. చీపుర్లు పుల్లల్లా వున్న కాళ్ళు చేతులను చూసి పిల్ల బ్రతకదనుకున్నాడు రావు.

'రేపు' ను చూస్తుందన్న ఆశలేని భానును, పదకొండేళ్ళ అన్నపూర్ణకు అప్పగించి, వెళ్ళిపోయింది మహాలక్ష్మి. అప్పటికి సత్యకు ఏడేళ్ళు. రుక్మిణీ, రాధ చిన్నవాళ్ళు. ఆ యింటికి ఆడ దిక్కు, పెద్ద దిక్కు అన్నపూర్ణే అయింది.

జగన్నాథరావుకు, అన్నపూర్ణకు ఇరవైయేళ్ళ తేడా వున్నా, అన్నపూర్ణ ఏనాడు రావు చెల్లెలిగా పెరగలేదు. పెద్ద కూతురిగానే పెరిగింది. రావుకు తన నలుగురు కూతుళ్ళకంటె, అన్నపూర్ణ మీదే ఎక్కువ అభిమానం. ఎవ్వరెన్ని చెప్పినా, వినని, మొండి పట్టుదల గల రావు, కొన్ని విషయాల్లో అన్నపూర్ణ మాటకు విలువ యిచ్చి వినేవాడు.

రావును బాగా అర్థం చేసుకుంది అన్నపూర్ణ.

రావు ఓ విధంగా పాత తరానికి చెందినవాడు. యింటి యజమానిగా అన్నీ తనిష్టప్రకారం జరగాలనే మొండి పట్టుదలతోపాటు, పరువు, ప్రతిష్ట కులం, సాంప్రదాయం అన్న వాటిమీద ఎక్కువ అభిమానం కల వ్యక్తి. యింటా బయటా ఒకే తీరుగా మసలే రావుతో ఒక్క అన్నపూర్ణే ధైర్యంగా మాట్లాడేది. పాలేర్లు సైతం రావు నడగడానికి భయపడి, "అన్నపూర్ణమ్మ తల్లీ" అంటూ అవసరాలను చెప్పి, ఆదరణ పొందేవారు.

కాని భాను వయసు పెరుగుతూవుంటే, పెద్దవాళ్ళయిన ముగ్గురికి విభిన్నంగా వాళ్ళ ముగ్గురిలో, తండ్రిపట్ల గల భయం, పిరికితనం లేకుండా ప్రత్యేకస్పైన మనస్తత్వంగల దానిలా మారిపోయింది.

సత్యకు, రుక్మిణికి తండ్రి అంటే అభిమానంతో పాటు భయం ఎక్కువ పిరికితనం వాళ్ళిద్దరిలో నిండుగా నిండిపోయింది.

యిక రాధ — ఆ యింట్లో అతి మౌనంగా, వుండేది రాధ ఒక్కతే. తనకేం కావాలో తనకే తెలీని అమాయకురాలు. ముగ్గురికంటే ఎంతో అందంగా, అపురూపంగా, పుత్తడిబొమ్మలా వుండే రాధలో, పసిపిల్లలో వుండే హుషారు, చురుకుతనం, అల్లరి కన్పించేవి కావు.

అన్నపూర్ణ తరువాత, భాను ఎక్కువగా మాట్లాడేది రావుతో; అన్నపూర్ణలో కనిపించే మాటి తత్వం, ఆత్మాభిమానం, నిండుగా కలబోసుకున్న భాను, ఎంతో హుషారుగా, చురుకుగా వుండి, తండ్రితో ఎంతో ధైర్యంగా మాట్లాడేది. ఒకోసారి భాను మాట్లాడే మాటలు వింటుంటె, సత్య, రుక్మిణి విస్మయంగా చూస్తూ లోలోపలె భయపడేవారు. రాధ మెచ్చుకోలుగా చూసేది తప్ప పెదవి కదపలేకపోయేది.

అన్నపూర్ణను అర్థంలేని ప్రశ్నలతో విసిగించే భాను అంటే సత్యకు కోపం.

తనకంటే చిన్నదైన భాను, క్లాసులో మంచి మార్కులతో ప్యాసవడం రుక్మిణికి బాధగా ఉండేది. "నీకంటే భాను నయం నీకంటే చిన్నదైనా ఎంతో తెలివిగలది" అంటూ మాష్టారు భానును మెచ్చుకొని తనను ఎత్తిపొడుస్తూవుంటే, తనను ఎత్తిపొడిచినందుకు గాక, "భాను అంత బాగా ఎందుకు చదువుతుంది?" అన్న బాధ రుక్మిణిని అమితంగా బాధించేది.

రాధకు లెక్కలంత బాగా రావు. ఎప్పుడైనా లెక్కలు రాకపోతే భాను నడిగేది. హోం వర్కు యిచ్చినరోజు రాధ సాయంత్రం రాగానే వాటితో కుస్తీపడుతూ కూర్చునేది. మధ్య మధ్య భాను ఆడుకుంటువున్న చోటికి వెళ్ళి "పదహారు మూళ్ళెంత?" అంటూ ఎక్కాలు అడిగితే నే చెబుతా! అంటూ రుక్మిణి చెప్పేది. "తప్పు... పదహారు మూళ్ళు నలభై ఎనిమిది. నలభై రెండు కాదు" అంటూ భాను దిద్దేసరికి, "పదహారుకాదు. పద్నాలుగు మూళ్ళు అని అడిగింది రాధ" అంటూ లోలోపలే గుణించుకొని, తన మాట రైటనిపించుకోవాలని తొందరపడి మాట మార్చేది రుక్మిణి.

"అబద్ధం! రాధక్క పదహారు మూళ్ళే అడిగింది. నీది రైటనిపించుకోవాలని..."

భాను మాట పూర్తికాకముందే, మొహమ్మీదే తననలా అంటున్నందుకు ఉడుక్కొని భానును కొట్టి వెళ్ళిపోయేది రుక్మిణి.

ఈ విషయం తెలిసిన అన్నపూర్ణ, చాటుగా రుక్మిణిని మందలించేది. దాంతో రుక్మిణి, భాను పుస్తకాన్నో, పెన్సిల్‌నో దాచేసేది. కాని ... భాను వాటిని అవే వెదుక్కొని, ఏం జరగనట్టు మాట్లాడేది. దాంతో, రుక్మిణే సిగ్గుపడిపోయేది. ఒక్కోసారి రుక్మిణి ఏదైనా అడిగితే భాను వెక్కిరిస్తుందేమోనని, లోలోపలె సిగ్గుతో చితికిపోతూ, చివరికి అడిగేది. కాని ... రుక్మిణి ఏదైనా అడిగితే భాను ఎంతో సీరియస్‌గా చెప్పేసేదే తప్ప వెక్కిరించేది కాదు.

"ప్రమాదానికీ, ఘోర ప్రమాదానికీ భేదం ఏమిటి!" అని ఒకరెవరో ఒక పెద్ద రాజకీయ నాయకుడిని అడిగారుట.

ఆయన తన ప్రత్యర్థి పేరు చెప్పి, "అతను ప్రయాణం చేస్తున్న నావ మునిగితే ప్రమాదం అవుతుంది అతను ప్రాణాలతో బయటపడితే ఘోర ప్రమాదం అవుతుంది." అని చెప్పాడు.

## 3

ఆ మర్నాడు ప్రయివేటు చెప్పడానికి వచ్చాడు పురుషోత్తమరావు. వరండా ప్రక్కనున్న గదిలో చాపవేసి, భాను, రాధ కూర్చున్నారు.

"నేను చదువుకోను అత్తయ్యా!" అంటూ సత్య నిష్కర్షగా చెప్పింది

"కనీసం ఉత్తరం అయినా రాయరాదుగా సత్యా!" అంటూ అన్నపూర్ణ ఎంతగానో నచ్చ చెప్పింది. సత్యకు చదువుకోవాలని వున్నా, భాను ముందు తను అక్షరాలు నేర్చుకోవడం. . ప్చ్... అంటూ మొండికేసింది.

రావుకు కూడా, సత్య పురుషోత్తమరావు దగ్గర ప్రయివేటు చదువుకోవడం యిష్టంలేదు. "పాతికేళ్ళు దాటిని పురుషోత్తమరావు, సత్యకు ట్యూషన్ చెప్పడం ఏమిటి? కుర్ర మాష్టారూ. లోకం ఏమంటుంది? అసలే పల్లెటూరు! తన పరువేంకాను." అంటూ ఆలోచించిన ఆయన, ఆ విషయాన్ని అన్నపూర్ణ ముందు అనలేకపోయాడు. కారణం అన్నపూర్ణ ముందు ఓడిపోవటం అతని కిష్టంలేదు

చివరికి సత్య పట్టుదలే నెగ్గింది. రావు తేలిగ్గా గాలి పీల్చుకున్నాడు. కాని సత్యతోపాటు, రుక్మిణి ప్రయివేటును తప్పించుకోవాలని చూసింది. చదువుమీద అసలు శ్రద్ధ లేని రుక్మిణి, సత్యలా యింట్లో వుండిపోతే బావుండు అని ఆలోచించేదే తప్ప, తనకంటె చిన్నదైన భాను అప్పుడే ఐదో తరగతి చదువుతోందన్న మాటె గుర్తించదు.

"నువ్వు మాత్రం తప్పించుకోలేవు రుక్కు! ప్రతినెలా నీకు మార్కులు ఎన్ని వస్తున్నాయో నాకు తెలుసు వెళ్ళి చదువుకో!" అంది శాసిస్తున్నట్టుగా అన్నపూర్ణ.

"అత్తయ్యా! మాష్టారును చూడవూ!" అంటూ వచ్చింది భాను.

"అత్తయ్య చూడదు. ఎందుకు చూడాలి?" అంది సత్య.

"అవునా అత్తయ్యా! అంతేనా?" కోపంగా అంది భాను అన్నపూర్ణ అవునన్నట్టుగా తలూపి "ఎందుకు చూడాలి?" అంది చిరుకోపంగా.

"అలాగె చూడొద్దులే!" అంది భాను విసురుగా వెళ్ళిపోతూ.

భానుకు అన్నపూర్ణమీద చాలా కోపం వచ్చింది. పురుషోత్తమరావు ఆ వూరొచ్చి పదిహేను రోజులకే అవుతోంది, భాను అంటే, అతనికి స్కూల్‌లో అడుగుపెట్టిన మొదటిరోజు నుండి అభిమానం ఏర్పడిపోయింది. భానుకు కూడా మాష్టారు అంటే ఎంతో అభిమానం, ఇష్టం.

క్లాసులో అడుగుపెట్టిన మొదటిరోజే భాను, పురుషోత్తమరావును ఆకర్షించింది. మాష్టారు క్లాసులోకి రాకముందే! "తెలుగుకు కొత్త మాష్టారు










వస్తున్నాడు'' అంటూ పిల్లలంతా అనుకుంటూ, — ''అతనెలా వుంటాడో, బెత్తంతో కొడతాడో, లేక బెంచిమీద నించోబెడతాడో! గోడకుర్చీ వేయిస్తాడో లేక, గుంజీళ్ళు తీయిస్తాడో, అంటూ ఓ ప్రక్క భయపడుతూనే, మరోప్రక్క బెత్తంతో కొడితే బావుంటుంది. కాసేపు మంటగా వున్నా, కొట్టగానే కూర్చోబెడతాడు. బెంచిమీద నించోబెడితే, దూరంగా కన్పించే హెడ్మాష్టరు రూములోకి, ఎదురుగా వున్న నాలుగో క్లాసులోని పిల్లలందరికి కన్పిస్తారు. అలా కన్పిస్తే ఇంట్రవల్‌లో అందరూ ఆటపట్టిస్తారు గుంజీళ్లయితే మరీ ప్రమాదం. గుంజీళ్ళు తీయరా అని మాస్టారు అంటాడే తప్ప 'ఇన్ని' అని చెప్పడు చాలు అనే వరకు అలా తీస్తూనే వుండాలి తీస్తున్నంతసేపు పిల్లలు అందరూ వెక్కిరిస్తూ చూస్తుంటారు గోడకుర్చీ అయితే బావుంటుంది ఎందుకంటే, మాస్టారు గోడకుర్చీ వేయించి, పాఠం చెబుతూ, పిల్లలంతా పాఠం వింటూ అంతగా పట్టించుకోరు. అలాంటప్పుడు చక్కగా నిలబడవచ్చు. అంటూ ఇలా ఆలోచిస్తూ, క్లాసంతా రణగొణ ధ్వనితో మార్మోగిపోతుంటే, భాను మాత్రం చాలా ఆత్రుతగా కొత్త మాస్టారు రాకకోసం ఎదురు చూస్తూ కూర్చుంది.

పురుషోత్తమరావు క్లాసులో అడుగు పెడుతూనే, మొదటి బెంచిలో చివర, తన కెదురుగా కూర్చున్న భాను కళ్ళు రెండు పెద్దవిచేస్తూ చూస్తూ కన్పించింది మాస్టారు రావడంతో, అటు ప్రక్కనున్న అబ్బాయిలు, ఇటుప్రక్క వున్న అమ్మాయిలు అందరు లేచి ఒక్కసారిగా ముక్త కంఠంతో ''నమస్కారం మాస్టారూ!' అంటూ గట్టిగా అరచి కూర్చున్నారు. ఒక్కసారిగా క్లాసంతా నిశ్శబ్దం ఆవరించింది.

''మాస్టారెంత బావున్నారూ! అక్కయ్యల్లా తెల్లగా!'' అనుకుంది భాను. అక్కయ్యలే తెలుపు అనుకున్న భాను మాస్టారును చూసి ఆశ్చర్య పోయింది.

''ఎంతవరకు జరిగాయి పాఠాలు?'' అంటూ పుస్తకం అడిగాడు భాను తన పుస్తకం తీసుకు

## అ న్న ...

వచ్చి యిస్తూ, సమాధానం ... .

క్లాసులో అలుముకున్న నిశ్శబ్దాన్ని చూస్తున్న పురుషోత్తమరావు, తనను చూసి పిల్లలు భయపడుతున్నారని ఊహించి, ఒక్కొక్కరి మొహంలోకి, నవ్వుతూ పరీక్షగా చూసాడు. అందరి కళ్ళలో భయం స్పష్టంగా కన్పిస్తోంది. అందరికంటె భిన్నంగా, మాస్టారు కంటె మరీ పరీక్షగా మాస్టారు వంకే నిర్భయంగా చూస్తోంది భాను.

మృదువుగా ఒక్కొక్కరి పేరే అడుగుతూ, చిరునవ్వు నవ్వుతున్న మాస్టారును చూస్తుంటే కాస్త భయం తగ్గిపోయింది అందరికి.

''అయిన పాఠాలన్నీ బాగా చదువుకున్నారా?'' అన్నాడు. తెలుగుపాఠంలో, అక్కడక్కడ ప్రశ్నలు వేసి చూసాడు. క్లాసు మొత్తంలో పదిమంది వరకు జవాబులు చెప్పారు భాను నడిగిన ప్రశ్నలకు జవాబులన్నీ తడుముకోకుండా చెప్పింది భాను.

గంట కొట్టగానే వెళ్లిపోతున్న మాస్టారు వెనకే వెళ్ళి, మరచిపోయి తీసుకువెడుతున్న తన పుస్తకాన్ని అడిగింది భాను.

''నీ పేరేమిటన్నావ్ పాపా!'' అన్నాడు.

జవాబు చెప్పి అలాగే నిలబడింది భాను.

''మీ పేరేమిటి మాస్టారూ?'' మెల్లిగా అడిగింది భాను.

''ఎందుకు?'' అన్నాడు మాస్టారు, ముచ్చటగా భాను వంక చూస్తూ.

''క్లాసులో అందరి పేర్లు అడిగారుగా మాస్టారూ! మరి... మీ పేరు ఎవ్వరికి తెలీదుగా.'' అంది అందరి తరపున తానే అడుగుతున్నట్లు.

''అందరి మాస్టార్లకు తెలిసిన మీ పేర్లు నాకు తెలియాలిగా మరి!''

''మాకూ అందరి మాస్టార్ల పేర్లు తెలుసుగా.''

''నా పేరు తెలీకున్నా ఫర్వాలేదమ్మా భానూ'' అన్నాడు పురుషోత్తమరావు.

''అది కాదండి మాస్టారూ! ఒక్కోసారి, మీరు క్లాసుకు రావడం ఆలస్యం అయినా లేక, మీరు బడికి రాకపోయినా, క్లాసులో అల్లరి ఎక్కువ అయితే, హెడ్మాష్టరుగారొచ్చి అడుగుతారుగా! ఇదే పీరియడు? మాస్టారెవరు?'' అని.

భాను జవాబుకు ఆశ్చర్యపోతూ, ''తెలుగు మాస్టారని చెప్పొచ్చుగా'' అన్నాడు ఆ క్షణంలో తొమ్మిదేళ్ళ భానుకు తనకు వయసులో వున్న తేడా, విలువ మర్చిపోయాడు పురుషోత్తమరావు.

''శర్మ మాస్టారుగారప్పుడు ఏడో తరగతిలో వుంటారు. ఆ విషయం హెడ్మాష్టరుగారికి కూడ తెలుసు మీ పేరె చెప్పాలి అప్పుడు'' అంది భాను.

సమాధానం సరిగ్గా చెప్పలేకపోయినా, భాను చెప్పే మాటల మూలం అర్థమైంది ఆ బడి మొత్తంలో తెలుగు మాస్టారు శర్మ ఒక్కడే అతను ఏడు నుంచి ఐదో తరగతి వరకు తెలుగే చెబుతాడు ప్రయిమరీ సెక్షన్‌లకు పురుషోత్తమరావే ఐదో క్లాసుకు లెక్కలుకూడా ప్రస్తుతానికి పురుషోత్తమరావే చెబుతాడు ఆ విషయం రాగానే హెడ్మాష్టరు చెప్పగానే, రెండు పీరియడ్స్ ఒకే క్లాసు అనేసరికి ఏమిటోగా అన్పించింది. హెడ్మాష్టరు గదిలోనుండి దూరంగా కన్పిస్తున్న ఐదో క్లాసును చూసి, గాభరా పడిపోయాడు క్లాసులోని పిల్లలంతా చాలా చిన్నవాళ్ళు, వాళ్ళను కొట్టి తిట్టి చెప్పడంకంటె, మంచి చేసుకొని చెప్పడం సులభం వాళ్ళు ఎంత అల్లరి చేస్తారో. తన సహనం ఎంతవరకు విరిచి గెలుస్తుందో ననుకుంటూ వచ్చాడు. కాని క్లాసులో ఆవరించిన నిశ్శబ్దానికి తోడు భాను మాటలు వింటుంటే ముచ్చటవేసింది. క్రొత్త, భయంతో అల్లరి చేయలేదేమోనన్న అనుమానం ఏ మూలో వున్నా అంతగా ఆలోచించలేకపోయాడు

పురుషోత్తం వెనుకే స్టాఫ్ రూమ్ వంకు వెళ్లింది భాను అప్పుడే బయటికి వస్తున్న సైన్సు మాస్టారు భానును చూస్తూనే, ''మీ క్లాసుకే వస్తున్నానమ్మాయ్ భానూ'' అంటూ పురుషోత్తమరావు వైపు తిరిగి — ''ఎలావుందండీ ఐదో క్లాసు పురుషోత్తమరావుగారూ! ఆ క్లాసులో ఈ అమ్మాయి వాకులాంటిది'' అంటూ భాను భుజంమీద ఆప్యాయతగా చేయివేస్తూ అడిగాడు పురుషోత్తమరావు సమాధానం చెప్పేలోగానే ''త్వరగా రండి మాష్టారూ!'' అంటూ భాను క్లాసువైపు పరిగెత్తుతూ వెళ్లిపోయింది.

నాలుగో పీరియడ్ క్లాసులోకి వెడుతున్న పురుషోత్తమరావు ఆగిపోయాడు.

R.P. 7321

ఆడది అంటేనే
కొన్ని రోజులు
అసౌఖ్యము మరియు
బాధ ఉంటాయి.
ఒకే ఒక సారిడన్
ఉపశమనమును
కలిగిస్తుంది.

అ "క్రుంగతీసే" రోజుల్లో మీరు నొప్పి మరియు కలవరపాటుతో ఒంటరిగా బాధపడుతూ ఉంటే, మీరు వాడవలసింది సారిడన్. సారిడన్‌యొక్క సాటిలేని తయారీ పద్ధతే నొప్పిని పోగొడుతుంది, సేదదేరుస్తుంది మరియు




నవోత్సాహమును కలిగిస్తుంది. అంటే రోష్‌యొక్క అంతర్జాతీయ పరిశోధనల ఫలితములు మీకు లభిస్తున్నాయి.

**సారిడన్**

ట్రేడ్‌మార్కు 'రోష్'

# అన్నపూర్ణ

"లెక్కల మాస్టారు సెలవులో వున్నారుగా లెక్కలెవరు చెబుతారు ?" ఓ అమ్మాయి ప్రశ్నకు, "లెక్కలకు కూడా పురుషోత్తమరావు మాస్టారే వస్తానని చెప్పలేదూ ?" అంటోంది భాను.

"ఆ మాస్టారెవరూ ?" ఎవరో భయంగా అడిగారు.

"ప్రొద్దున తెలుగు చెప్పలేదు, ఆ మాష్టారే. ఆయన పేరే పురుషోత్తమరావు." గట్టిగా చెప్పింది భాను.

భానుకు తన పేరెలా తెలిసిందో అర్థంకాలేదు పురుషోత్తమరావుకు. క్లాసులో కెళ్లగానే నిశ్శబ్దం ఆవరించింది. భాను గర్వంగా చూస్తోంది.

రెండు ప్రాత లెక్కలు యిచ్చి చేయమన్నాడు. క్లాసులో అంతవరకు వున్న నిశ్శబ్దం పారిపోయింది. ఒకరి నొకరు అడుగుతూ ఒకరిదాంట్లో ఒకరు చూస్తూ, చేస్తున్నారు. ఈసారి కాస్త ఆలస్యంగా లెక్క పూర్తిచేసి తీసుకువచ్చింది.

"అప్పుడే చేసేసావా భానూ ?" మాస్టారు ప్రశ్నకు తలూపుతూ, — "మాస్టారూ ఈ అభ్యాసం అంతా చేయించలేదండి. ఈ రెండు లెక్కలే చెప్పారు" అంది.

భానుతోపాటు మరో ఇద్దరు ముగ్గురు చేసారు. "వెళ్లిపోయేముందు పాత మాస్టారూ ఆ రెండు లెక్కలే చెప్పారు. మళ్ళీ వారం రోజులుగా ఎవ్వరు రాలేదు. ఆ రెండు లెక్కలు కూడా చాలామందికి అర్థం కాలేదు జ్ఞాపకం అసలు లేవు" గందరగోళంగా పిల్లలంతా చెప్పేసరికి, మళ్ళీ వాళ్ళకు అర్థం అయేలా చెప్పాడు.

"నువ్వు యింటి దగ్గిర ప్రయివేటు చెప్పించుకుంటూనా భానూ ?" మాస్టారు ప్రశ్నకు అడ్డంగా తలూపుతూ, — "రోజూ బళ్ళో చెప్పిన పాఠాలన్నీ అత్తయ్య కూర్చోబెట్టి చదివిస్తుంది. వారం రోజులుగా ఈ లెక్కలన్నీ నేను చేస్తూనే వున్నాను." అంది.

"నీ అత్తయ్య చెబుతుందా ?"

"ఊహూ... అత్తయ్యకు ఈ లెక్కలన్నీ రావు. దగ్గిర కూర్చొని చదివిస్తుంది" అంది

"నా పేరు నీ కెలా తెలిసింది ?" మాస్టారు ప్రశ్నకు భాను అందంగా నవ్వింది. చిన్నారి బుగ్గలు సొట్టలు పడి అందంగా వంపు తిరిగిన పెదవుల మధ్య ముత్యాల్లాటి పలువరస మెరిసింది

"యిందాకా సైన్సు మాస్టారు పిలిచారుగా ! అప్పుడు విన్నాను" అంది.

"చాలా చురుకైన పిల్ల" అనుకున్నాడు పురుషోత్తమరావు

ఆ తరువాత వారం రోజులకు, క్రితం నెల పరీక్షల మార్కుల రిపోర్టు యిచ్చారు. భాను మార్కులు చూసిన పురుషోత్తమరావు అందరి మాస్టార్లలాగే భాను మీద అభిమానంతో పాటు, ఏదో మమకారం పెంచుకున్నాడు

"నువ్వు పెద్దయ్యేకా కూడా యిలాగే చదువుకోవాలి భాను డాక్టరువై మంచి పేరు సంపాదించుకోవాలి" అన్నాడు.

"ఊహూఁ.. అందరికి చేదు మందులు, ఇంజక్షన్లు ఇవ్వను మాస్టారూ మీలా మంచి మాస్టారు నవుతాను" అంది రక్కున. ఎప్పుడో ఆలోచించి యిప్పుడు చెబుతున్నట్టుగా. విని నవ్వుతూ మనసులో దీవించాడు పురుషోత్తమరావు.

బళ్లో జరిగిన విషయాలన్నీ రోజు అన్నపూర్ణతో చెప్పే భాను, మాస్టారు విషయంకూడా చెప్పి, "మాస్టారుకు నేనంటె చాలా యిష్టం, మా మాష్టారూ చాలా మంచివాడు పాఠాలు బాగా చెబుతాడు. నువ్వోసారి మా మాస్టారును చూడవూ అత్తయ్యా !" అంది భాను. కాని ప్రయివేటు చెప్పడానికి మాస్టారు యింటికి వస్తున్నా, భాను కోరిక తీరలేదు

ఆ రాత్రి అన్నపూర్ణతో సరిగ్గా మాట్లాడలేదు భాను. గుండెల్లో యిమిడిపోయి నిద్రపోయే భానూ దూరంగా, అలిగి పడుకోవటంతో అన్నపూర్ణకు బాధ కలిగింది.

బళ్లో అందరు మాస్టార్లు భానును మెచ్చుకుంటారు. దాదాపు అందరూ ఒక్కసారైనా తమ యింటికి వచ్చిపుంటారు ఏనాడు వాళ్లని చూడమని భాను యింతగా తనను ఇబ్బందిపెట్టలేదు అయితే భాను మాటల్లో, మాస్టారంటే భానుకెంతో ఇష్టమని గ్రహించిన అన్నపూర్ణకు మాస్టారును చూడాలనే వుంది.

"మాస్టారు ఎప్పుడూ నాతో మాస్టారులా మాట్లాడరు. ఎంతో చనువుగా, మా క్లాసులోని చిట్టిబాబుకంటే కూడా స్నేహంగా మాట్లాడతారు." అంటూ మురిసిపోతూ చెబుతుంటే చూడాలన్పించినా, అంతలోనే తన ఆలోచనకు నవ్వుకుని "నేను మాస్టారును చూడ్డం ఏమిటి?" అనుకుంది అన్నపూర్ణ. కాని ఆ విషయం భానుకెలా చెప్పాలో అర్థంకాలేదామెకు.

భానును దగ్గరికి లాక్కోవాలని అన్నపూర్ణ చేసిన ప్రయత్నం ఫలించలేదు "సరే నేనిక నీతో మాట్లాడను భానూ !" అంటున్న అన్నపూర్ణ మాటలకు, భాను మాట్లాడలేదు· కాని మరో పావుగంట గడిచేసరికి, భాను వెక్కి వెక్కి ఏడ్వడంతో లేచి కూర్చొని గాబరాగా భానును దగ్గరికి తీసుకుంది అన్నపూర్ణ.

"నాతో మాట్లాడవూ అత్తయ్యా ! మాస్టారును చూడొద్దులే" అంటున్న భాను మాటలకు భానును గుండెలకు హత్తుకుంటూ ఓదార్చింది.

"అలా మారాం చేయొచ్చానురి ! ఎప్పుడో వీలు చూసుకొని నేను చూస్తాగా !" అంటూ భానును నిద్రపుచ్చి, ప్రశాంతంగా నిద్రపోతున్న భాను మొహంలోకి చూస్తూ "అమ్మో...భానును విడిచి భానుతో ఒక్కక్షణం మాట్లాడకుండా గడపగలదా తను ? తన వాళ్లో పెరిగినందుకేమో అందరికంటె కూడా భాను అంటే తనకు అభిమానం ఎక్కువ. తన మనస్తత్వాన్ని పుణికిపుచ్చుకుని, రావును విసిగిస్తూ, జవాబు చెప్పలేని ప్రశ్నలు వేస్తూ, "అమ్మో అన్నపూర్ణా ! భాను నీ కోడలనిపించుకుంటుంది" అని అంటుంటే తృప్తిపడిపోతుంది అన్నపూర్ణ రోజూ భాను చేసే అల్లరి చేయకపోయినా, స్కూల్ నుండి ఆలస్యంగా వచ్చినా, ఓ ముద్ద అన్నం తక్కువ తిన్నట్టు అన్పించినా రావు కంటే ఎక్కువ కంగారుపడిపోతుందామె.

(ఇంకా వుంది)

---

# సినిమా

(22వ పేజీ తరువాయి)

కళను చలం చేసట్టారు. ముఖ్య పాత్రలను ఎస్వీ రంగారావు, రాజబాబు, రమాప్రభ, అల్లు రామలింగయ్య, ప్రసన్నరాణి, సూర్యకాంతం పోషిస్తున్నారు. కథానాయకుడు కొత్తవాడు ఇంకా పేరు పెట్టలేదు. హైద్రాబాదు నివాసి కథానాయికగా సుమిత్ర అనే కొత్తమ్మాయి నటిస్తున్నది.

***కిరణ్ ప్రొడక్షన్స్ !***

హైద్రాబాదు వాస్తవ్యులు వై. క్రిస్టఫర్, పి. హనుమంతరావు స్థాపించిన ఈ సంస్థ "మూడు ముళ్లు" అనేడి చిత్రాన్ని నిర్మిస్తున్నట్టు లోగడ ఒకసారి వ్రాశాను అదెంతవరకు వచ్చిందో తెలుసుకుందామని వాళ్ల ఆఫీసుకు వెళ్లాను. అక్కడ "మీరా" నిర్మాత పి. వి. రమణయ్య అగుపించారు. ఆయన ఒక కొత్త రచయితను నాకు పరిచయం చేస్తూ ఆయన కథను కిరణ్ కోసం కొన్నట్టు చెప్పారు.

ఆ రచయిత పేరు శివరాజు వూరు విజయనగరం. ఎం. ఏ డిగ్రీ పొందిన వ్యక్తి. ఆయన యింతవరకు తన రచనలను ఏ పత్రికకు పంపలేదట ఈయన రాసిన కథకు కొత్త నటీనటులు కావాలట ముఖ్య పాత్రలను పోషించడానికి యిరవై ఏండ్ల అమ్మాయి, యిరవై అయిదేండ్ల అబ్బాయి కావాలని పి వి. రమణయ్య కోరుతున్నారు

## రష్యన్ చిత్రంలో తెలుగు నటి

నటి విజయనిర్మలకు విదేశ చిత్రంలో నటించే అవకాశం వచ్చింది. ఇటీవల తాష్కెంట్ చలన చిత్ర వుత్సవంలో ఆమె హీరో కృష్ణతో వెళ్లి పాల్గొంది. "అల్లూరి సీతారామరాజు" చిత్రానికి అక్కడివాళ్ళు ప్రశంసల వర్షం కురిపించారు రుమేనియా భాషలో అనువదించే ఒప్పందం జరిగింది. మరికొన్ని దేశాలవారు అడుగుతున్నారు.

రష్యన్ భాషలో నిర్మితమయ్యే ఒక చిత్రంలో నటించగలరా అని ఆ నిర్మాత విజయనిర్మలను అడిగారు. అలాగే. మీ స్క్రిప్టు చూచిన తరువాత తప్పకుండా చేస్తాను అని ఆమె మాట యిచ్చింది ఆ చిత్రంలో యీమె హిందూ స్త్రీగా నటిస్తుంది. తెలుగు భాషలో సంభాషణలు చెపితే, దానిని రష్యన్‌లో వాళ్ళు డబ్ చేస్తారట

రష్యాతో వ్యాపార ఒప్పందం కుదరడం కష్టసాధ్యం అన్నారు హీరో కృష్ణ కారణం స్క్రిప్టును వాళ్ళు ఓ. కె చెయ్యాలట. వాళ్ల నటుడు ముఖ్య పాత్రను పోషించాలట ఇవన్నీ జరిగే పనులా ? అన్నారు డేరింగ్ హీరో.

—శ్రీనివాస్

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో నాడు సీరియల్‌గా ప్రచురింపబడి మీ మన్ననలందుకొన్న నవల
నేడు చలన చిత్రంగా రూపొందింది!




# అనగనగా ఒక తండ్రి

దర్శకత్వం సి యస్ రావు. [illegible] మహేష్
సంగీతం: చక్రవర్తి. కెమెరా: జి.కె. రాము
ఆంధ్ర. విజయా కంబైన్స్ [illegible] సుభాచిత్ర

# చిదంబర రహస్యం

డా. ముదిగొండ శివప్రసాద్

## 2

(గత సంచిక తరువాయి)

ఇప్పుడు నేను చిదంబరరావు ముఖ్య భక్తులలో ఒకణ్ణి. ఉదయం అందరూ లేవకముందే నిద్రలేచి స్నానాదులు ముగించుకొని చిదంబరరావుగారి రూంకు వెళ్ళాను. నేను వెళ్ళేటప్పటికే గురూజీ రూంకు నటరాజన్ అని పూళ్ళో నుండి మరో భక్తుడు వచ్చి వుంటాడు—

ఆయనకు చిదంబరరావంటే సాక్షాత్తూ కల్కి అవతారమనే నమ్మకం. ప్రతి రోజూ పూలూ పళ్లతో వస్తాడు పాదపూజచేసి తీర్థంపుచ్చుకొని ఆ పైన డ్యూటీలోకి వెళ్తాడు. తర్వాత చిదంబరరావు రూముకు స్వామీ, పాత్రో, చటర్జీ ప్రభృతులు వస్తారు. అక్కడి నుండి గురూజీతో సంభాషణ ప్రారంభమవుతుంది. ఆయనేమీ అతిలోక విషయాలగూర్చి ఎప్పుడ మాట్లాడరు. కేవలం లోకంలోని తిరుతెన్ను గూర్చీ నిరుద్యోగ సమస్య గూర్చీ యాంత్రి నాగరికతవల్ల ఉత్పన్నమైన సమస్యల గూ ప్రసక్తంచేస్తారు. వాటికి పరిష్కార మార్గా కొన్ని సూచిస్తారు. కొన్నిటిని 'కాలమే పరిష్క రిస్తుంద'ని వదిలేసి వూరుకుంటారు




చిదంబరరావుగారి భక్తులలో డిప్ లిస్ కుప్. చదువుతున్న రాధాస్వామికూడావున్నాడు. ఆయన దృష్టిలో చిదంబరరావు సాక్షాత్తు దయాళ్బాగు రాధా స్వామి అవతారం అంద లోనూ తాను చదువుకున్న కాలంలో తనక సహాయంగా చిదంబరరావును పరమేశ్వరుడూ తన గురువూ అయిన రాధాస్వామే పంపాడని ఈ రాధాస్వామి నమ్మకం అందుకు తగ్గట్టే చిదంబరరావు రాధాస్వామికి ఎంతో సహాయం చేసేవాడు బయట రాధాస్వామి వేయవలసిన ఫీల్డు సర్వే మొత్తమూ చిదంబరరావే చేసి పెట్టేవాడు. జాలారిపేటలో భజనలు నిర్వహించడం, రికార్డులు వ్రాయడం అంతా చిదంబరరావే చేసేవాడు

నిజానికి చిదంబరరావుకూడా చేసేవాడు కాదు. రాత్రి రాధాస్వామి తనకు కావలసిన వర్క్ బుక్స్ గురూజీ గదిలో పూజామందిరంలో పెట్టి పోయేవాడు. తెల్లవారేసరికి అన్ని పుస్తకాలలోనూ వర్క్ మొత్తం సిద్ధంగా వుండివుండేది.

ఒకరోజు సాయంత్రం గురూజీ నాతో అన్నారు 'కుమార్ జాలారిపేట భజనకు వస్తావా ?'

మారు మాటాడకుండా వెంబడించాను— 'వస్తావా' అంటే రమ్మనే గురూజీ ఆజ్ఞ అన్నమాట.

నేనూ రాధాస్వామీ, గురూజీ ముగ్గురం జాలారిపేటలోని రామమందిరానికి వెళ్ళాము. అక్కడ పగలల్లా వడవని చేసి అలసిపోయిన జాలారి వాళ్ళు చాలామంది చేరారు. కొందరు స్త్రీలు పసిబిడ్డలతోసహా వచ్చారు – ముందు భజన కార్యక్రమం — తర్వాత గురూజీ ప్రసంగం –

ఆ ఉపన్యాసం జాలారివాళ్ళకు బాగా నచ్చింది. ఎందుకంటే భక్తినిగూర్చి కాని

# మోదీ దారములను గుర్తించు పోటీ

OBM/228 Tel

పటిలో ఎన్నో దారములున్నాయి! ఎక్కడో తెలుసుకోండి!

**మొదటి బహుమతి: AIR FRANCE ఏర్ ఫ్రాన్స్ విమానంలో పేరిస్‌కు ఇద్దరికి తిరుగు ప్రయాణపు టిక్కెట్లు**




ఈ తమాషా చూడండి, సులభం కూడాను:
మీరు చేయవలసిందల్లా బొమ్మలోని ఒక్కొక్క వస్తువునూ బాగా పరిశీలించడం. ఆ తర్వాత ఏ బొమ్మలో మోదీ దారాన్ని ఉపయోగించవచ్చునని మీకు అనిపిస్తుందో దానికి రంగు పెన్సిల్‌తో కానీ సిరాతో కానీ రంగు పోయడం ఒకటే మాత్రం గుర్తుంచుకోండి, మోదీ దారాలను ఎంబ్రాయిడరీకి మాత్రమే కాదు ఉపయోగించేది

ఇప్పుడు మోదీ దారాలకు 10 పదాలకు మించకుండా అందర్నీ సులభంగా ఆకర్షించగల ఒక నినాదాన్ని ఆలోచించి **"Spot the Modithread Contest", Modi Thread Mills, Modinagar (U.P.).** చిరునామాకు వెంటనే పంపండి మీ ఎంట్రీతో పాటు 'MTM' దారాల విప్పల రెండు లేబిల్స్ గానీ, ఒక రీలు గానీ ఒక దారం ఉండగానీ రసీదుతో కూడా పంపించవలసి వుంటుంది.

మీకు దగ్గరలో వున్న మోదీ దారాల డీలర్ దగ్గరకు వెళ్ళి ఒక ఎంట్రీ ఫారం, పోటీ గురించి వివరాలు, అడగండి.

**ముగింపు తేదీ: 15 సెప్టెంబర్**






**మోదీ దారములు**

రంగురంగుల మోదీ దారాల రంగులు వెలిసిపోవు.

ప్రవృత్తియోగాన్ని గురించి కాని మాట్లాడ కుండా జాలారివాళ్ళకు నైలాను వలలు ప్రభుత్వం సప్లై చేయవలసిన ఆవశ్యకత గూర్చి అర్ధగంట సేపు మాట్లాడి అలాంటిది జరగాలంటే వాళ్ళందరిలోనూ ఐకమత్యం చాలా ముఖ్యం అని ఉద్బోధించారు. గోదావరి జిల్లాకు చెందిన గురూజీ విశాఖ వాళ్లతో అచ్చంగా జాలారి వాళ్ళ మాండలికంలో మాట్లాడటం నాకు ఆశ్చర్యంవేసింది. అంతకుమించిన విచిత్ర మేమంటే గురూజీ భజనను చూడడానికీ, ఉపన్యాసం అనంతరం తమ సందేహాలు తీర్చుకోవడానికి ఆ సమీపంలోవి చాలామంది ఉద్యోగస్తులు కూడా వచ్చారు. వాళ్ల ప్రశ్న లన్నిటికీ గురూజీ సమాధానాలు ఇచ్చేవారు అవి యుక్తియుక్తంగానూ ఆలోచించినకొద్దీ అర్ధవంత లుగానూ వుండేవి.

'స్వామీ నా పై ఆఫీసరు లోక కంటకుడు. రిటైర్ అయినా కూడా ఎక్స్‌టెన్షన్ సంపాదించుకున్నాడు అన్యాయంగా. ఈ భక్త పరమాణువుకు ఆ పోస్ట్ ఎప్పుడు వస్తుందంటారు?'

'దేనికైనా కాలం రావద్దా నాయనా.'

ఆ రిటైర్డ్ ఆఫీసరుకు త్వరలోనే కాలం ముగిసిందనీ మాకలు చెల్లాయని అర్థం.

'మా వాడు మెడిసన్ సీటుకు అప్లై చేశాడు ఏ వూళ్లో వస్తుందంటారు ?'

'వాడి భాగ్యం ఎక్కడ పండితే అక్కడే వస్తుంది. దిగులెందుకు నీకు ?'

హైదరాబాదులో వస్తుందని సూచన —

'మొన్న మా యింట్లో దొంగలుపడ్డారు— పోలీసు రిపోర్టు కూడా ఇచ్చాము ఇంతవరకు ఫలితం కన్పడలేదు స్వామీ'

'ఇంటి దొంగను ఈశ్వరుడైనా పట్ట లేడయ్యా'

దొంగతో గుర్కావాడో, పని మనిషో షరీకై వుండవచ్చునని నాకు తోచింది. కాదు వాళ్ల బావమరిదే ఈ దొంగతనం చేయించాడని ఆ వచ్చిన వ్యక్తి నమ్మకమట — విధిని గూర్చిన ఆ అనుమానం స్వామివారి సన్నిధిలో నిజమైంది కూడాను. ఇంకేం బావమరిదిని ఇంట్లో నుండి తరిమేసేందుకు కృతనిశ్చయుడై వెళ్లాడు ఆ ఆసామీ. ఇలా ఎన్నో ప్రశ్నలకు గురూజీ జవాబులు చెప్పేవారు. అందరికీ అయన మాట వేదాక్షరంలా తోచేది. ప్రత్యక్ష ప్రమాణాలు కూడా కన్పించేవి.

> *జరిగిన కథ:* యూనివర్సిటీ విద్యార్థి చిదంబరరావు కొన్ని మానవాతీతశక్తులను కలిగి ఉన్నాడని తోటి విద్యార్థి అయిన కిరణ్ కుమార్ క్రమేణా నమ్మి అతనికి సన్నిహితు డవుతాడు.

# చిదంబర రహస్యం

వాటికి తోడు మహిమలూ మంత్రాలూ — త్వరలోనే జాలరిపేటలో ఒక చిదంబరేశ్వర మందిర నిర్మాణం చేయాలనీ, మహారాణి పేటలోనూ, దొండపర్తిలోనూ రెండు చిదంబర తత్వాన్వేషణకై అధ్యయన కేంద్రాలనూ ఏర్పాటు చేయాలనీ భక్తులు నిశ్చయించారు. చిదంబర రహస్యాన్ని ప్రపంచానికి అందించడానికై ఒక పత్రికను కూడా స్థాపిస్తే బాగుంటుందని కాల్టెక్స్ ఉద్యోగులు, షిప్‌యార్డ్ ఆఫీసర్లూ సూచించారు. ఆకాశవాణి బృందం వారు ప్రచారం బాధ్యతను తమ భుజస్కందాల పై వేసుకున్నారు—పత్రికకు, ఉద్యోగం కూడా వదిలి నిర్వహణ బాధ్యత స్వీకరిస్తానని నటరాజన్ అందరి ఎదుటా ప్రమాణం చేశాడు.

నేను గురూజీతో జాలరిపేటకు వెళ్లినప్పుడల్లా కింగ్‌జార్జి హాస్పటల్లో పనిచేసే ఓ నర్సు వచ్చి ముందు వరుసలో కూర్చొని వుండేది. ఆమె స్వామివారిని ఏమీ ప్రశ్నలు వేసేదికాదు. ప్రసంగం, ప్రశ్నలకు సమాధానాలూ, ముగిశాక ఆమె ఆశాపూరిత నయనాలతో స్వామివైపు చూసేది. చిదంబర రావుగారు ఆమెనొకసారి చూచేవారు అంతే! ఆమె మనస్సులో వున్న సందేహాలు తీరినట్లు భావించి వెళ్లేది— ఇలా జరగడం నేను చాలా సార్లు చూచాను— దానితో నాకేదో కుతూహలం పెరిగింది. ఆమె ఏమి కోరుకుంటున్నదో తెలుసుకోవాలనే కోరిక నాలో దిన దిన ప్రవర్ధమానమైంది. ఆమె సంశయాలేమిటి? వీరి మౌన వ్యాఖ్యానమేమిటి ??

ఒకనాడు గురూజీ ప్రసంగం, జవాబులూ ముగిశాక భక్తులంతా ఆయన , చుట్టూ మూగారు. ప్రసాదాలు పంచిపెడుతున్నారు. నేను ఆమెతో మాట్లాడాలని ముందుకు నడిచాను. ఆశ్చర్యం! ఆమెకూడా నాతో మాట్లాడాలని ఇటు చూస్తున్నట్లు ఆమె కళ్లను బట్టి గమనించాను—

నన్నుచూచి ఆమె నవ్వింది—

నాకేదో గుండె ఝల్లుమన్నట్లు అనిపించింది— దగ్గరకు వచ్చి నమస్కరించింది ఎంతో వినయంగా. నేను మళ్లీ నమస్కారం పెట్టాను.

'కిరణ్ కుమార్ జీ!' పెదవులపై ఎర్ర మందారాలు పూచినట్లు నవ్వుతూ నాతో ఏదో చెప్పబోయింది.

నేను భయంగా గురూజీవైపుకు చూశాను.

ఆయన భక్త సమూహంతో చర్చలలో మునిగిపోయారు.

ఆమె అన్నది 'నా పేరు మాధవి. ఇక్కడ ఆస్పత్రిలో పని చేస్తున్నాను — మీరు స్వామిజీకి చాలా ఆత్మీయులని విన్నాను. దయతో నా కొక చిన్న సహాయం చేసి పెట్టాలి—'

'స్వామిజీకి అందరూ ఆత్మీయులే. అయినా మీకేం కావాలో చెప్పండి. నా శక్తి వంచన లేకుండా చేస్తాను.'

ఆమె ఒక్క క్షణం ఆగింది.

ఆమె ఏం చెపుతుందా అంటూ అలా చూస్తున్నాను.

మాధవి అన్నది 'తమకు అభ్యంతరం లేకపోతే రేపొకసారి మా యింటికి రాగలరా ?'

'అ—లా—గే'

నాలో ఏవో తెలియని కొత్త కొత్త స్పందనలు. సరికొత్త లోకాలు.

మాధవి, మహారాణీ పేటలో తానుండే చోటు చెప్పింది. శీతల 'సరస్సులో నల్ల తామరలు వికసించినట్లు ముంగురులతో చుట్టుకున్న ఆ ముఖంలో కళ్ళు మెరుస్తున్నా వాటి వెనుక ఏదో దిగులు వున్నట్లు గమనించాను నాభులాగా !

'దయతో నాకీ చిన్న సహాయం చేసి పెట్టారా మీ మేలు నీజన్మలో మరిచిపోలేను. పటం పెట్టి పూజ చేసుకుంటా ము ఉదయం ప్రతిరోజూ మిమ్మల్ని'

చర్చలూ, ప్రసాదాలూ అన్నీ ముగిశాయి—

గురూజీ యూనివర్సిటీకి బయలుదేరారు.

నేనూ వెంబడించాను.

బస్ స్టాపువరకు వెళ్లాక నన్నుచూచి అన్నారు 'ఏమిటి మాధవి నీతో చెప్పుతున్నది?'

గురూజీ చూచారన్న మాట — ఆయన చూడకుండా వుండటమా ??

'అవును గురూజీ — మీరు చూచినట్లున్నారే'

'అవును — చూచాను కాని వినలేదు —

కొందరు 'చూడటమే కాని వినరు— కొందరు వినడమేకాని చూడరు'— ఈ మాటలకు అర్థం ఏమిటి ??

'మాధవి కేదో కష్టం వచ్చిందట. నన్నొక సారి వాళ్ల ఇంటికి రమ్మన్నది—'

గురూజీ విని ఊరుకున్నారు.

'వెళ్లమంటారా గురూజీ'

'వెళ్లు — కాని చూడు కిరణ్ అజ్ఞానం అంధకారంలాంటిది— ప్రత్యక్ష దర్శనం లభి స్తేనే కాని అది తొలగదు. కాని దర్శనం లభించడం అంత తేలికా ?'

ఎవ్వరో హెచ్చరిస్తున్నట్లనిపించింది—

కాసేపట్లో యూనివర్సిటీకి చేరాను—

మాధవిని లోగడ చాలాసార్లు ఈ భజన సమావేశంలో చూచానుకాని ఇవాళ ఆమెనాతో మాట్లాడటంతో ఏదో కొత్త అనుభూతి, కొత్త మాధుర్యం కనిపించింది.

నిజంగా మాధవి చాలా అందమైన వాళ్లల్లోనే లెక్క. ఆమె అందం మొత్తం ఆ మెడలో వుంది.

అదేదో కవులు వర్ణించేటట్లుంటుంది శంఖంలాగానో మరెలాగో — ఎంతసేపు చూచినా తనివి తీరదు. నిజం చెప్పాలంటే ఆమెనలా చూడాలనిపించింది కూడాఎక్కువగా ఈనాడే !

చూచినకొద్దీ మళ్లీ చూడాలనే కోరిక— చూస్తున్నకొద్దీ ఏదో జంకు—ఏదో తీపి— పక్కమీద పడుకున్నాను—

వెంకటరెడ్డి చదువుకుంటూ వున్నాడు—

## చిదంబర రహస్యం

'ఏం కిరణ్—పుస్తకం ముట్టలేదు—'

'మనసేం బాగాలేదు రెడ్డీ'

*  *  *

మర్నాడు సాయంత్రం అనుకున్న సమ యానికే వెళ్లాను.

మాధవి గౌరవంతో లోనికి ఆహ్వానించి అతిధిమర్యాదలు చేసింది.

ఆమె అందించిన కాఫీ తాగుతూ ఇల్లంతా పరిశీలించాను. చాలా నిరాడంబరంగా వుంది. అయితే చాలా నీట్‌గా అలంకరించుకున్నది —

ఇంట్లో ఎక్కడా మగసవ్వడి విన్పడలేదు—

'త్వరగానే వచ్చేశారు—' ఆమెకూడా నా కెదురుగా కూర్చొని కాఫీ తాగుతూ అన్నది—

'అవును. త్వరగానే బస్సు అందింది' అబద్ధం—చెప్పాను నిజానికి ఇంకా తొందరగానే రావాలని కోరిక—కాని ఎంతకూ సాయంత్రం కాలేదు కదా !

'మీ వారు ఇంకా ఆఫీసునుంచి వచ్చినట్లు లేదు'

ఆమె నవ్వింది—

సిగ్గుపడింది.

ఇంగ్లీషులో అన్నది 'నేను అవివాహితను'

ఆవిషయం నేను పోల్చుకున్నమాట నిజమే ముందుగానే, అయినా ఏమిటో తొందర— ఆమె నోటనే వినాలనే కోరిక.

మరీ నా ప్రవర్తన నాకే బాగుండలేదు. కాని—

మనస్సు ఏమిటో తొందరపెడుతున్నది. కోతిలా గెంతుతున్నది.

స్థిరం తప్పి చరిస్తున్నది—

'మా అమ్మకు నేనొక్కతెనే కూతురును నా చిన్నతనంలోనే మా నాన్నగారుపోయారు కష్టపడి నన్ను పెంచి పెద్దచేసింది. నర్స్ ట్రైనింగ్ చెప్పించింది. అప్పుడే ఆమెకు కంటిజబ్బు వచ్చింది. ఎవడో అరకులోయ నుండి ప్రకృతి సంబంధమైన చికిత్స చేస్తా నని ఓ కొండరాజు వచ్చాడు. ఓ మూలిక ఇచ్చి అరగదీసి కంటికి పెట్టు తెల్లవారే సరికి తగ్గుతుందన్నాడు— అలాగే చేసింది— కాని. తెల్లవారే సరికి చూపు పూర్తిగా పోయింది—' ఈమాటలు చెపుతుంటే మాధవి ముఖంలో దైన్యం ఆవరించింది.

ఎంతో ఖిన్నురాలై పోయింది—

'మీ అమ్మగారు...'

'రండి చూద్దురు—'లేచింది.

నేనూ లేచాను—

ఆమె లోపల గదిలో గుండా పెరట్లోకి సాగింది.

నేను బూట్లు విప్పుతున్నాను—

'ఫరవాలేదు— రండి—'

ఆమెను వెంబడించాను—

పెరట్లో ఓ చెట్టుకింద ముసలావిడ కూర్చొని వుంది.

'అమ్మా...'

'మాధవి'

'ఆయనొచ్చారమ్మా'

'నిజంగానా' ముసలావిడ ఆనందంతో కదిలి పోవడం గమనించాను.

'ఆయనొచ్చారు' అన్న మాటలో నాకేదో వేయి వీణలు మోగినట్లనిపించింది. ఆయ నొచ్చారు — ఆయన ! !

'బాబూ ఇటురా—' నన్ను దగ్గరగా పిలి చింది ఆమె ఆప్యాయంగా.

సమీపంగా వెళ్లాను.

మాధవి మరో కుర్చీ తెచ్చి వేసింది.

కూర్చున్నాను.

ముసలామె చేతితో తడుముతూ ఏదో సంతోషాన్ని వెలిబుచ్చింది — కళ్లవెంట అప్రయత్నంగానే ఆమెకు నీళ్లు జాలు వారాయి-గొంతు గాద్గదికమైంది —

'బాబూ కిరణ్ కుమార్ — ఇక నన్నీ నువ్వే రక్షించాలి.

[ ఇంకా వుంది ]

## మినీ ఇంటర్వ్యూ

'అంచులు పుచ్చుకుంటే నేరం ! కాని —నేను లంచం పుచ్చుకోనందువల్ల...



నా ఉద్యోగం ఊడి పోయింది. అన్నాడు ఎల్. పి. ఇ. ప్యాసై, ఇటీవలే ఉద్యో గంలో చేరి, పోగొట్టుకున్న ఎం.ఫణిప్రకాష్. అందుకే బి. ఇ. చదవాలనుకుంటున్నాడు కాని ఉద్యోగం చేస్తూ బి. ఇ. చదవాలి తప్ప మరో మార్గంలేదుకూడా అన్నాడు. ప్రకాష్‌కి సినిమాలంటే ఇష్టం ! హిందీ సినిమా లంటే మరీ ఇష్టం ! ఫాషన్‌లంటే ఇష్టంలేదు ! కాని సూటు వేసుకుని ఫోటో తీయించుకున్నాడు. అమెరికన్ అంతా కృష్ణభక్తులవుతుంటే, మనం నాగరికత పేరుతో దిగజారి పోతున్నాం !' అన్నాడు. ఆస్తికుడు.

చదువు కొనసాగించాలి. 'ఏదైనా మంచి ఉద్యోగం సంపాదించాలి! మిగతా ఆలోచనలన్నీ తర్వాత...' అన్నాడు ప్రకాష్. జర్నలిజం వేపుకి మొగ్గు చూపే అవకాశాలున్నా ఎందుకో అటుగాక సాంకేతిక రంగం పరిజ్ఞానం, వేపే మనసు తిరిగింది. ఒకసారి ఆంధ్రోద్యమంలో ఉపవాసం చేశాడు—

[గీతా ఫీచర్స్.]

# ఆమె సున్నితమైంది...ఆమె అర్థంకానిది...
# ఆమె మృదువైంది, దృఢమైంది, సౌందర్యం
# సంతరించుకున్నది... అందుకే ఆమె పరిపూర్ణ స్త్రీ...

ఘుమఘుమంటి టాల్కు... అనురాగ పూరితమైనది. మిమ్మల్ని అలరించేది. సరికొత్త సువాసనతో మిమ్మల్ని ఉత్తేజపరచేసేది. అదే మీ వీయిల్ ఆఫ్ లౌ. హేలో వారు మాత్రమే సమర్పించగలిగేది. గాలిలో తేలియాడే సుఖానుభూతిని మీకు కలిగించేది. హేలో కోసమే ప్రత్యేకించిన సువాసనల శృంగారానుభూతిని అనుభవించండి.

ప్రతి క్షణం మరువలేని మధురానుభూతిని కలిగించేందుకే, వీయిల్ ఆఫ్ లౌ తో అలంకరించుకోండి. హేలో మాత్రమే వెదజల్లు సువాసన గల పన్నీటి జల్లు.

హేలో వీయిల్ ఆఫ్ లౌ టాల్కు
హేలో మాత్రమే వెదజల్లు
సువాసనలు... అనురాగ
వల్లరులు

## ఆమెకోసమే
## హేలో
## వీయిల్ ఆఫ్ లౌ
## టాల్క్



## ప్రశ్నావళి
### కె. రామలక్ష్మి

**పి వి ఆర్ గుడ్లవల్లేరు**

ఆంధ్రప్రదేశ్‌ను తెలుగునాడుగా మార్చాలన్న అంశంపై మీ అభిప్రాయం ఏమిటి ?

కొంప అంటుకుని ఏడుస్తూవుంటే, చుట్ట కాల్చుకుందుకు కావలసినంత నిప్పు అనుకున్నాట్ట వెనకటికో పెద్దమనిషి. అలావుంది—మీ గోల...దైనందిన సమస్యలతో జనం చస్తూంటే—ఆవాళ్ళు చచ్చే ప్రదేశ్ ఆంధ్రప్రదేశ్ అయితే ఎవడికి కావాలి? తెలుగునాడు అయితే ఎవడికి కావాలి ?

**పి.హెచ్.ఎల్.ఎన్.ఆర్. గుడుగుంట్ల పాలెం.**

మీకు మన సంస్కృతి పైవుండే అభిమానానికి కృతజ్ఞుడిని. మీకు విప్లవ రచనలు నచ్చక పోడానికి కారణం మూఢ నమ్మకాలే ననుకుంటాను.

కావచ్చు. తాము తప్పించి ఎవరు చెప్పినా, రాసినా అది "ఉట్టి చచ్చు" అనుకునే— ఏ రచనలైనా నాకు నచ్చవు.

ప్రేమసమస్య గురించి అంత నిర్లక్ష్యంగా మీరిచ్చే జవాబులంటే నాకు మహాచిరాకు ?

చిత్రం—పిల్లల విషయాలు తెలియచెప్తే—ఎవరి పనాకోసం రావడం సహజం కదా ? మీ బాధలాగే మీ ప్రేమ వ్యవహారం కూడా మీ దగ్గరే వుండాలి. అందరినీ బాధపెడితే ఎలా ?!

**టి. ఎస్. హెచ్. బెంగుళూరు.**

ఇందిరా గాంధిపై మీ . అభిప్రాయం.

అందరిలోకీ మీ నల్ల కృష్ణుడే భల్లన !... ఎంతోమందికంటే గుండెలు తీసిన మొనగాడనిపించుకుంటూంది మేడమ్' గాంధి !

వాటర్‌గేటు గురించి వివరంగా చెప్తారా ?

బాబూ, అమెరికన్లు ఏంచేసినా ఘనంగా చేస్తారు. మార్కెట్లో ఐదొందల పేజీల పుస్తకం వచ్చింది— కొనుక్కుని చదివి ఆనందించు !

**జె. ఎల్. ఆదిలాబాదు.**

'మని' అండ్ 'షి' వుంటే మనిషి అవుతాడా !

అవడు—డబ్బుతోపాటు వితరణ, స్త్రీతోపాటు గౌరవం చూపెట్ట కలవాడే—మనిషి అవుతాడు.

మనీకి వున్న విలువ మనిషికి లేకపోవడానికి కారణం ?

మనీగెట్స్ మెనీ థింగ్స్. మనిషి కానతా లేదు. అందుకే 'సంపాదించాలోయ్' అంటూ ఆత్రపడి పోతాడు.

**ఎన్ టి ఆర్ ఎన్ రాజంపేట**

మమత అంటే ఏమిటో తెలియని మానవులపై మీ అభిప్రాయం ?

అలాంటి వాళ్ళుంటారా అని? అయినా—మమతా మనిషి ఒకసారే పుట్టారన్నది— ఆత్రేయ ఉవాచ. అలాంటప్పుడు మనిషి బ్రతికి వుంటే మమత అనలేశమైనా ఉండి తీరాలి !

**ఎస్. ఎస్. ఆర్. విజయవాడ.**

మామూలుగా పురుషుడు స్త్రీతో మాట్లాడేటప్పుడు అతని చూపులు ఎటువైపున వుంటాయంటారు ?

ముఖంపైన ! మాట్లాడే వాళ్ళముఖం చూసి మాట్లాడ్డం సభ్యత. నిలకడలేని చూపులు—మంచి మనసుకు నిదర్శన కావు.

స్త్రీలంతా ఒకచోట చేరినప్పుడు 'ఆ అబ్బాయి మంచివాడు' అనుకునేలా చేయాలంటే....

కరపత్రాలు పంచు వాయనా కుతూహలంగా చదువుకుంటారు.

**టి. కె. ఆర్. నిర్మల్.**

మనిషి మనిషిని తినే రోజులు వస్తాయని నా నమ్మకం. ?

ఇంకా రాలేదనేనా మీ ఉద్దేశ్యం ?!

---

చాలా ముచ్చటగా ఉంది. ఓ పక్క గోడకి చాలా ఖరీదయిన ఫ్రేమ్‌లో రెండుమూడు ఫొటోలు తగిలించి ఉన్నాయి. వాటిల్లో రేఖ ఏదో గాళ్స్ బాడ్మింటన్ టీమ్‌తో ఉంది.

"అవన్నీ హైస్కూల్లోవి లెండి. వరుసగా మా బాచ్ రెండేళ్ళు ఛాంపియన్‌షిప్ కొట్టాము..." అంది జానకి.

ఆమె నవ్వుతోన్నప్పుడు చాలా అందంగా ఉన్నట్లనిపించింది శోభనాచలానికి.

టేబుల్ మీద ఉన్న పెద్ద ఫొటో ఫ్రేమ్‌లో నలుగురు క్రికెట్ ప్లేయర్స్ మధ్య జానకి మంచుని ఉన్న ఫొటో ఉంది.

"అదెక్కడిది?" అడిగాడతను.

"రంజీ ట్రోఫీలో ఆడారు వాళ్ళు. మీకు తెలుసుకదా..." అంది ఉత్సాహంగా.

"క్రికెట్ అంటే మీకు పంచప్రాణాలను కొంటావే..." నవ్వుతూ అన్నాడు శోభనాచలం.

"అవును. కాని మీరంటే పంచ ప్రాణాలు మాత్రమేకాదు. అన్ని ప్రాణాలూనూ! అన్నట్లు మీతో పాటు ఫొటో దిగడానికి పర్మిషనివ్వాలి నాకు..."

"ఓ! కాదనేంత ధైర్యం నాకు లేదు..."

అన్నట్టుగానే మరో అరగంటకల్లా ఆమె తండ్రి ఇంటికి వచ్చేశాడు. అంతా సరదాగా కబుర్లు చెప్పుకొంటూ భోజనాలుముగించారు.

ఆ తరువాతచాలా సార్లు వాళ్ళింటికెళ్ళాడు

## అవుట్

(13 వ పేజీ తరువాయి)

శోభనాచలం. ఒక రోజు ఆమెతండ్రి అతన్నీ జానకినీ కలిపి ఫొటోలు కూడా తీశాడు. రెండ్రోజుల తర్వాత ఆమె గదిలోని ఫొటో ఫ్రేమ్‌లో క్రికెట్‌డ్రస్‌లో ఉన్న శోభనాచలం జానకిల ఫొటో వెలసింది. తను ఒక్కరోజు కనిపించకపోయినా జానకి దిగులు పెట్టుకొనేట్లు కనిపించిందతనికి. ప్రతి రోజూ వాళ్ళింటిదగ్గరో—తమఇంటిదగ్గరో ఇద్దరూ కలుసుకొని కాసేపయినా క్రికెట్ గురించో, మరోటి గురించో మాట్లాడుకోవల్సిందే. ఈ లోగా తనకి ఉద్యోగం రావడం, ట్రైనింగ్‌కి వెళ్ళిపోవడం—

పొద్దున్నే లేచి జానకి ఇంటివైపు నడిచాడు శోభనాచలం.

"హలో చలం! ఎప్పుడొచ్చారు ?" అంది ఆశ్చర్యంగా.

"రాత్రే వచ్చాను..." అన్నాడు శోభనాచలం. ఆమె అదివరకంటే మరింత అందంగా కనిపించిందతనికి. కానీ కొంచెం సన్నబడింది.

"ఎలావుంది జాబ్ "

"బాగానే ఉంది కాకపోతే కొత్తప్లేస్ కావడం మూలాన బోర్ కొడుతోంది..." నవ్వుతూ అన్నాడతను.

"అక్కడ క్రికెట్ ఆడుతున్నారా?"

"ఊహూ...మా ఆఫీసులో అసలు స్పోర్ట్స్‌మెన్ అంటూ ఒక్కడుకూడాలేడు. ఏదయినా క్లబ్‌లో జాయినవ్వాలనుకొంటున్నాను...ఎక్కడికో ప్రయాణమౌతున్నట్లున్నారు ?" అడిగాడతను.

"అవును... క్రికెట్ మాచ్ జరుగుతోంది మెడికల్ కాలేజీ గ్రౌండ్స్‌లో... ఇంజినీరింగ్ టీమ్‌లో రామరాజు ఎంత లవ్‌లీగా ఆడుతున్నాడో తెలుసా? అబ్బ! ఆయామ్ మ్యాడ్ ఆఫ్టర్‌హిమ్...డాడీకూడ వస్తానన్నారిప్పుడు చూడ్డానికి..." శోభనాచలం చిన్నబుచ్చుకొన్నాడు. ఒకప్పుడు తననుమించిన ఆటగాడు లేడన్న జానకే ఇవాళ రామరాజు గురించి గొప్పగా మాట్లాడుతోంది.

తనతో మాట్లాడేప్పుడు చూపిన అదివరకటి ఉత్సాహం, ఇంట్రెస్టూ—ఇప్పుడామెలో లేవు.

"హలో మిస్టర్ శోభనాచలం... ఎప్పుడొచ్చారు?" లోపలికొస్తూ అన్నాడామె తండ్రి.

"రాత్రే వచ్చానండీ..." నవ్వుతూ జవాబిచ్చాడతను.

"ఇప్పుడెక్కడ ఉండటం?"

"హైద్రాబాద్‌లో "

"వెరీగుడ్! నాకీ మధ్య అమ్మాయి చెప్పే

# విశ్రాంతి పొందండి!
# చార్మినార్ త్రాగండి.

అచ్చమైన
మేలిరకం పొగాకుల
పరిమళము కమ్మదనం
అనుభవించండి.




53*
పైసలకు
10

వి ఎస్ టి తయారీ

భారత దేశపు అత్యధికంగా అమ్ముడుపోయే సిగరెట్!

CMVS 95 R 234 TL

* ... అధికతమ చిల్లర ధర (స్థానిక పన్నుల అనుసారం)

వరకూ తెలీదు, మస్తిక్క డలేవని... అమ్మాయీ నేనూ మాచ్ కెళ్ళాలని బయల్దేరుతున్నాం ఇప్పుడు ... చాలా బాగా ఆడుతున్నాడ్లే కుర్రాళ్ళు ... రామరాజు అనే కుర్రాడయితే



# అవుట్

ఎక్సలెంట్ అనుకో! టెస్ట్ ప్లేయర్ అయిపోతాడు ఖచ్చితంగా''

శోభనాచలం లేచినుంచున్నాడు. అతని మొఖం వివర్ణమయిపోయింది.

ఆ ముసలాడి మీదా, జానకి మీదా గొంతు వరకూ వచ్చింది కోపం.

''నేను వెళ్తానండీ...'' అంటూ లేచినుంచున్నాడు.

''ఓకే-అమ్మాయితో కూడా చెప్పివెళ్ళు...''

మేడమీదకు నడిచాడు శోభనాచలం. అద్దం ముందు కూర్చుని హడావుడిగా పౌడర్ రాసుకొంటోంది జానకి.

''నేను వెళ్తున్నా జానకీ...'' అంటూ గదిలోకి అడుగు పెట్టాడతను.

గది ఏమీ మారలేదు.

''ఓకే ... వెళ్ళు ... కాసేపు మాట్లాడదామనుకొన్నాను గానీ — మాచ్‌కి టైమయిపోతోంది'' అన్నది.

శోభనాచలానికి రక్తం మరిగిపోతోంది.

కోపంగా వెనక్కు తిరగబోతూ టేబుల్ మీద ఫోటో ఫ్రేమ్‌వంక చూశాడు. కళ్ళు రెండుమూడుసార్లు టపటప లాడించి మరీ అందులోని ఫోటోవంక చూశాడు. అందులో తనూ జానకీ ఉన్న ఫోటో లేదు.

మరో క్రికెట్ ప్లేయర్‌తో జానకి నవ్వుతూ దిగిన ఫోటో ఉంది.

జానకి లేచి నుంచుంది.

''ఫోటో చూస్తున్నావా! అతనే రామరాజు...''

మరింక అక్కడ నిలబడలేకపోయాడు శోభనాచలం. వేగంగా మెట్లుదిగి రోడ్డుమీద కొచ్చి నాలుగంగల్లో ఇల్లు చేరుకొన్నాడు. ఇంటిముందు అరడజను సైకిళ్ళాగి ఉన్నాయి. హాల్లో కేకలూ నవ్వులూ వినబడుతున్నాయి. తన బావి వచ్చేశారన్నమాట. ఆనందంగా లోపలికడుగుపెట్టాడు శోభనాచలం. సుబ్రమణ్యం, రామ్‌చంద్రరావ్, బాబూరావ్, రామన్న, రమణ, ప్రసాద్ — అందరూ కూర్చుని ఉన్నారు. అరగంటసేపు అందరూ ఒకరి విషయాలొకరు తెలుసుకొన్నారు నవ్వుతూ—జోకులు వేసుకొంటూ.

''ఏదిరా అలా మైన్‌రోడ్ మీదకు పోదాం...'' అన్నాడు బాబూరావ్.

అందరూ సైకిళ్ళమీద బయల్దేరారు.

రెండేళ్ళక్రితం రోజులు గుర్తుకొచ్చినయి శోభనాచలానికి. అప్పుడు తన వెంబడి పాతికమంది కుర్రాళ్ళకు తక్కువుండేవారు కాదు. తను హీరో ఆ రోజుల్లో. తనతో మాట్లాడితేనే గొప్పగా భావించే జూనియర్స్ అనేకమంది అప్పుడు.

ఓల్గా దగ్గర సైకిళ్ళు పెట్టేసి అందరూ బిలబిలమని లోపలికెళ్ళి ఓ టేబుల్ చుట్టూ కూర్చున్నారు.

''మీరందరూ అలా టోటల్‌గా క్రికెట్ వదిలేశారెందుకురా? నాకెంత కోపముస్తుందో తెలుసా మీ మీద?'' కోపంగానే అన్నాడు శోభనాచలం.

''ఏమోరా, వెధవది ఇంట్రెస్ట్ ఉండటం లేదు...'' నసిగాడు సుబ్రమణ్యం.

''ఏరా బాబూరావ్ నీకేం రోగంరా—లక్షణమైన ఆటచేతిలో ఉంచుకొని...''

''ఇంకెక్కడి ఆటలేరా—ఆడింది చాలుగాని, ఇంటికొచ్చి వ్యవసాయం చూసుకో మంటున్నాడు నాన్న. త్వరలోనే బిక్కవోలుకి మకాం ఎత్తేస్తున్నాను కూడా...'' శోభనాచలానికి ఏం మాట్లాడ్డానికీ పాలుపోవడం లేదు. ఒక్క వెధవకూడా ఉత్సాహం లేకుండాపోయిందేం?

''వెధవ క్రికెట్‌దేముంది కాని, నేనూ, ప్రసాదూ కలిసి ఈ ''డీ స్టోవ్ షాప్'' పెట్టాలనుకొంటున్నాంరా... ఉద్యోగాలెలాగూ దొరికి చచ్చేట్లు లేవు... ఒకవేళ దొరికినా హైదరాబాద్‌లో పడి అఘోరించాల్సిందే—వాళ్ళెప్పుడయినా 'ఆంధ్రా గోబాక్' అంటే పరిగెత్తుకురావాలి—ఇక ఆంధ్రాలో ఇండస్ట్రీలు పెట్టటం అనేది జరగదు. అందుకని...''

ఏదో చెప్పుకుపోతున్నాడు రామచంద్రరావ్.

''ఇవాళ ఏదో క్రికెట్ మాచ్ ఉందట కదా మెడికల్ కాలేజీ గ్రౌండ్సులో—వెళ్ళి చూద్దామా? రామరాజు అనేకుర్రాడు పొడిచేస్తున్నాట్ట...'' అడిగాడు శోభనాచలం.

''మాచ్ బోర్‌రా బాబూ''—మంచి మాటింగ్ షో ఉంది మెజిస్టిక్‌లో—పోదాం పదండి దానికి...''

అన్నాడు సుబ్రమణ్యం.

''అవును...పిక్చర్‌కే పోదాం...'' అన్నారు మిగతా వాళ్ళంతా.

కాదనలేక సినిమాకి బయల్దేరాడు శోభనాచలం వాళ్ళందరితోనూ.

దోవలో జగన్ కార్లో ఎదురొచ్చాడు. శోభనాచలాన్ని చూడగానే కారు ఆపేడు.

## ఫాలాక్షుని డైరీ

### క్షౌరశాల గిరాకీ పెంచిన కాలేజీ !

బొంబాయికి చెందిన సోమయ్య కాలేజీలో దర ఖాస్తు ఫారాలను పట్టుకునించున్న క్యూ చెల్లా చెదరై చూస్తుండగానే కాలేజీకి దగ్గరలో ఉన్న ఓ బార్బర్‌షాపు ముందు క్యూగా మారిపోయిం దట. హిప్పీల్లాగా భుజాల మీద జుట్టు పడుతుండే వారికి సీటు యివ్వమని ఆ కాలేజి అనడమే ఇందుకు కారణమట. చిన్న మినీ గౌనులు, గొట్టాం ప్యాంటులు, బెల్‌బాటమ్స్, అడ లుంగీలు, అది తరాలను రెండేళ్ళ క్రితం ఈ కాలేజి నిషేధించిందట

* * *

కటక్‌లో పొడుగుపాటి జుత్తులు పెంచుకున్న వారిని పోలీసు వేటాడుతోందట. ఈ వేటాట భరించలేని పొడుగు జుట్టువారు బార్బరు షాపులను శరణు కోరుతున్నారట. హిప్పీలు నిశాచరులై నిబం ధనలు మీరి సంచరిస్తున్నారని, దొంగలవాల వంటి వాటిలో కూడా వీరికి జోక్యం ఉందని అక్కడి పోలీసు శాఖ అన్నదట.



### ఏనుగు దుండగం

సత్యమంగళం అనే వూరు సమీపంలో ఉన్న పవళకు ట్టైలో ద్రవిడమున్నేట్ర కళగం ముఖ్యుడు 40 ఏళ్ల పెరుమాళ్ళు, ఆయన భార్య పుదూరు అనే వూరులోని ఓ పెళ్ళికి వెళ్ళి, ఇంటికి తిరిగి వస్తుండగా, దారితప్పిన ఓ అడవి ఏనుగ వీరిని చూసి బెదిరి, ఘీంకరించి పెరుమాళ్ళను తొండ ముతో పట్టుకుని ఎత్తి నేలకేసి కొట్టి, కాలుతో నేలరాసి, చంపిందట. ఆయన భార్య మాత్రం ప్రాణాలు కాపాడుకోగలిగిందట.

### సినిమాచూసి చేసిన హత్య !

హర్యానాకు చెందిన జైళ్ల డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ మిస్టర్ ఈశ్వరిసింగ్ కదమ్ అనే ఆయన పోయిన రెండో తేదీ ఆదివారం రాత్రి కర్నల్ అనే వూరు నుంచి చండీఘర్ వెళ్ళా రట. ఇంటికి వెళ్ళి, వెంటనే షోను చేస్తానని చెప్పి, ఆయనలా చేయకపోయేసరికి ఆయన భార్యక్క

---

## అవుట్

"హలోచలం, ఎప్పుడొచ్చావ్ ?" కారు దిగ కుండానే అడిగాడు.

శోభనాచలానికి వళ్ళు మండిపోయింది. అది వరకు తనను అనేక సార్లు బ్రతిమాలికారులో తిప్పేవాడు.

"రాత్రే వచ్చాను..."

"ఓ...కే...ఎక్కడికో వెళ్తున్నట్లున్నారు ...వస్తా..." కారు వెళ్ళిపోయింది.

అంతా సినిమాహాల్లో కూర్చున్నారు. సినిమా మొదలయింది. శోభనాచలం సినిమా చూస్తున్నాడుగాని మనసంతా అల్లకల్లోలంగా తయారయిపోయింది.

సినిమా ముగిసేసరికి జ్వరం వచ్చినట్లయి పోయింది.

ఎవరిదారిన వాళ్ళు ఇళ్ళకు వెళ్ళిపోయారు.

వారంరోజులు సెలవున్నా రెండ్రోజులకే తిరిగి హైదరాబాద్‌కు ప్రయాణమయ్యా డతను.

బాబూరావ్ బస్‌స్టాండ్ కొచ్చాడు.

బస్ బయల్దేరడాని కింకా పావుగంట టైముంది.

"ఒరేయ్ చలం !... నీకో విషయం చెప్తాను ఏమీ అనుకోవుగదా..." అన్నాడు బాబూరావ్ నవ్వుతూ.

"ఛవ్ ! నేననుకోవటమేమిట్రా..."

"[illegible] అబ్జర్వ్ చే[illegible] [illegible]గేదురా ! [illegible] మనం క్రికెట ఆటగాళ్ళం — మనలాగానే ఫుట్‌బాల్, వాలీబాల్, హాకీ—ఇలా తొంభై రకాల ఆటగాళ్ళున్నారు. అందరూ మంచి ఆటగాళ్ళే—అందరికీ ఫాన్స్ ఉంటారు. ఆడుతూన్నప్పుడు మనని చూసి విపరీతమైన అభిమానం, పెంచేసు కొంటారు చాలామంది. ఆరాధిస్తారు, ఆ సమ యంలో వాళ్ళకి మనని మించిన దేముడు లేడు. మనం వాళ్ళ దృష్టిలో హీరోలం. అవునా ! అంత వేగంగా ముక్కూమొఖం తెలీని వాళ్ళ మీద కేవలం ఆటచూసి పెంచేసుకొన్న అభిమానం ఎంతసేపుంటుందంటావ్ ? ఆ ఆట ఆడినంతసేపే — ఆ తరువాత మహా అయితే మరికొంతసేపూ అంతే అక్కడితో ఆ ప్రభావం నెమ్మదిగా దిగటం ప్రారంభి స్తుంది. మనం జీవితమంతా ఆడుతూనే ఉంటే శాశ్వతంగా వాళ్ళ నాకట్టుకోవచ్చు. కానీ అది మనవల్ల కాదు కదా! మనలో ఎవ్వడూ లక్షాధికారిలేడు. ప్రతిఒక్కడూ కూడా పొట్టకోసం ఏదోఒకపని చేయాల్సిందే —అలాంటప్పుడు ఖచ్చితంగా ఆటకు అడ్డు ఏర్పడుతుంది. పైగా మనకున్న బాధ్యతలు కూడా తక్కువేంకావు. ఇల్లు చూసుకోవాలి పెళ్లీపేరంటం—పిల్లాపీచూ-కష్టసుఖాలూ— సినిమాలేమిటి ? ఆడినంత ఉత్సాహంగా వయసు పెరిగినకొద్దీ ఆడనూలేము, కానీ జనానికి కావల్సింది నువ్వుకాదు. వాళ్ళక్కావల సింది ఆట! నిన్న శోభనాచలం — ఇవాళ రామరాజు—రేపు లక్ష్మీపతి — ఇంతే వాళ్ళిలా చూసుకొంటూ ముందుకు ప్రయాణిస్తూనే ఉంటారు. మనం అక్కడే ఆగిపోతే—ఒంటరి వాళ్ళమవుతాం—అంచేత మనం కూడా వాళ్ళతో బాటు ప్రయాణం చేయాలి — నిన్నటి నీ సంగతి వాళ్ళతోబాటు నువ్వు మర్చిపో! అప్పుడు నీకిక బాధ ఉండదు..."

బస్ ఇంజన్ స్టార్ట్ చేశాడు డ్రైవరు...

"ఓకే...ఇక ఉంటారా?" చేయి ఊపాడు బాబూరావ్.

బస్ కదిలింది.

శోభనాచలం కళ్ళనిండుగా నీళ్ళు నిలచినయి.

తాను తాము అవుటయిపోయినఆటగాళ్ళు. అందరూ ఆడుతున్నవాళ్లను చూస్తారుగానీ— అవుటయిపోయిన వాళ్లను చూడరు గదా—

జానకి గుర్తొచ్చింది శోభనాచలానికి.

ఆమె దృష్టిలో తను అవుటయిపోయాడు. తనను గమనించటంలేదని తను ఆమె మీద కోపం తెచ్చుకుంటున్నాడు.

నవ్వు వచ్చింది శోభనాచలానికి.

ఇక లాభంలేదు.

తను అవుటయిపోయాడు.—

ఈ సారి ఆ నవ్వులో జీవితం తెలిసిం తర్వాత [illegible]ంతి నవ్వులాంటి తెలివి మెరిసింది.

# షేవర్ స్విష్

## మరియు బద్మాష్‌పూర్ దొంగలు



















**అది ఎల్లప్పుడూ జరుగుతుంది;**
**స్విష్‌తో గెడ్డము గీసు కొన్న మనిషి,**
**సాటిలేని మనిషి.**

అనుమానం వచ్చి బుద్ధరన్నగార్లతో కలసి కర్నల్ పాంపి చంపేశారో వెళ్ళిందట. ఎని క్రూరుడు ముందు ఆయన రాలేదని దబాయించి, ఆనక నసిగి, పారిపోయాడట. ఇల్లంతా వెతికితే బాత్ రూమ్‌లోని ఓ అలమరలో తల, కుడి చెయ్యి లేని శరీరం ఉందట. ఈ దారుణ హత్య ఎవరి పుణ్యమాని చూసి నౌకరు శివాజీరావుని పట్టుకుంటే అతని దగ్గరున్న ఓ పెట్టెలో కటవ్ తాళాలు, బట్టలు, ఫారిన్ ట్రాన్సిస్టరు, కెమేరా వగైరాలు దొరికాయట. తను చూసిన ఓ హిందీ సినిమా తరకే హత్యకు కావలసిన ఉద్రేకం, ఉపాయం కూడా యిచ్చాయని ఆ నౌకరు చెప్పాడట.

## హత్యకు దారితీసిన దొంగతనం !

జూన్ ఆరవ తేదీన తంజావూరుకు చెందిన 30 ఏళ్ల శేషాద్రి అనే అతను తన తల్లిదండ్రులతో తిరుపతి కొండ ఎక్కుతుండగా ఓ దురాత్ముడు దారికాసి, వారిని ఆపి నగలూ, నట్రా, డబ్బూ దస్త్రా యివ్వమని బెదిరించి, నగలూడదియ్యమని శేషాద్రి తల్లిని బెదిరించాడట. దాంతో శేషాద్రి అతనితో తలపడేసరికి ఆ దురాత్ముడు శేషాద్రి చెయ్యి నరికి, తన చేతికందినదానికి ఎట్టుకు పారిపోయాడట. ఆసుపత్రిలో చేర్చాక, ఫలితం లేక శేషాద్రి చనిపోయాడట.

## దొంగల్లో సినిమా !

మాధవ్‌సింగ్, మెహర్‌సింగ్, కల్యాణ్‌సింగ్ అనే ముగ్గురు బందిపోటు దొంగలు పోయినేడు

# ఫాలాక్షుని డైరీ

జయప్రకాశ్‌నారాయణ్ పిలుపుకు వచ్చి, ప్రభుత్వానికి లొంగిపోయి ప్రస్తుతం శిక్ష అనుభవిస్తున్నారట. బొంబాయిలోని ఓ సినిమా నిర్మాత వీరి ముగ్గుర్నీ పెట్టి "చంబల్ కి షేర్" అనే సినిమా తీయాలని సంకల్పించి, ముగ్గురికీ మూడేసి వందల వేలు ఇవ్వనున్నాట్ట. దీనికి మధ్యప్రదేశ్ ప్రభుత్వం అభ్యంతరపోయి "బందిపోటు దొంగలు సినిమా కథా నాయకులు అగుటయా" అని ఈ విషయాన్ని ముఖ్యమంత్రి పరిశీలించి నిర్ణయిస్తారని అన్నాడట.

## పంటా పెరిగింది-ధరా పెరిగింది !

ఆంధ్రప్రదేశ్‌లో ధాన్యం పంటయీయేడు విపరీతంగా పండిందనీ, గిడ్డంగులన్నీ పిట పిటలాడిపోతున్నాయనీ సివిల్ సప్లయిస్ డైరెక్టరు మిస్టర్ ఎస్. సుబ్రహ్మణ్యం అన్నారట. పోయినేటి పంట 3 లక్షల టన్నులయితే ఈ ఏటి పంట 7 లక్షల టన్నులట. మంచి బియ్యం క్వింటాల్ 180 ధరకి పోయినేడు పోతే, యీ ఏడు 200 రూపాయలనుమ్మతోందట— ఇదేమి వింత ?

* * *

దేశంలో గోధుమ సేకరణ విషయంలో ప్రభుత్వం దెబ్బతిన్నదటీయేడు. పోయినేడు 3335.9 వేల టన్నులయితే యీ ఏడు మొన్న జూన్ ఆరవ తేదీ వరకూ 892.4 వేల టన్నులేనట. చాలా రాష్ట్రాలు కనీసం ఒక్క గింజయినా సేకరించలేకపోయాయట. సేకరించిన రాష్ట్రాలలో గుజరాత్ 14.3, రాజస్థాన్ 7.9, మహారాష్ట్ర 15.9, పంజాబ్ 567.6, హరియానా 182.6 వేల టన్నులట.

## ఉద్యోగాలిస్తున్న దొంగనిల్వలు

ఉత్తరప్రదేశ్‌కు చెందిన బులాంద్ షహర్‌లో దొంగతనంగా నిల్వవున్న గోధుమలను బయటికి కక్కించడానికి ఆ జిల్లా మెజిస్ట్రేటు ఓ చక్కని పథకం వేశారట. నిరుద్యోగులయిన పట్టభద్రులు ఎవరయినా రోజుకు పది టన్నుల గోధుమలు బయటకు లాగే ప్రయత్నంలో సమాచారం అందిస్తే వారికి నిశ్చయంగా చక్కని ఉద్యోగం యిస్తామని అన్నారట. ఉత్తరప్రదేశ్‌లోని భూగర్భంలో అక్రమంగా దాక్కున్న ఆహారధాన్యాలను బయటికి లాగలేక పోయినప్పుడు తాను తనున్న జిల్లానే వదలి పోతానన్నారటా మాజిస్ట్రేట్ మిస్టర్ డి. ఎస్. బగ్గా.

## బుర్ర పదునుకు మందు !

వీలా బుర్ర చురుగ్గా, ఇంకా చురుగ్గా పని చేయాలంటే తీపి పదార్థాలెక్కువ తినుడు. పప్పు కూరలు, వగంటలా తగ్గించుడు అని మశాచుసెట్స్ ఇన్‌స్టిట్యూట్ టెక్నాలజీ ఉద్బోధించిందట. కార్బోహైడ్రేట్‌ల వల్ల బుర్రకి పదును వస్తుందని ప్రొటీనులు బుర్రను పదును చేసే శక్తిని తగ్గిస్తాయని ఆ ఇన్‌స్టిట్యూట్ అభిప్రాయపడిందట.

— దెవలప్యపట్రైయిన్.

## చిన్నారి చిలిపిచేష్టలు

మా పెద్ద పాపకి అపురూపంగా కొన్న గౌను చెమ్కీ పువ్వులూ అదీ వున్నది కాస్త దానికి పొట్టి అయిపోయింది. అది కొంచెం ఖరీదైందేమో. నాకుయెవరికీ యివ్వబుద్ధి కాలేదు... సరే... చిన్నపాప మూడేళ్లదున్నది. దానికి చాలుతుంది కదా అని, ఓనాడు తొడిగాను. సరిగ్గా అతికినట్లు సరిపోయింది. కాని పెద్దపాప మారాము చేసింది. నా గౌను చెల్లాయి కిచ్చావు... మరి నాకు గౌను లేదు ఎలాగా? అని...

దాని పోరు పడలేక నేను శ్రీవారు, పెద్దపాప బళ్లోకి వెళ్లగానే చిన్నదాన్ని వెంట తీసుకుని రెడీమేడ్ షాపుకి వెళ్లాం. అక్కడ మా పెద్దమ్మాయి కొలతలకు చాలిన గౌనులనేకం తీసి చూస్తున్నాం ... మా చిన్నపాప దాని



ఎంపిక ప్రారంభించింది. "అదొద్దమ్మా! యిది ఎర్రగా వుంది బాలే ... దీనికి మచ్చలు (పువ్వులు) లేవు వద్దే" అని యిది "ఛీ! యాక్క్" (అసహ్యం)

అని తీసిపారేస్తూంది. "అదికాదే బేబీ ఈ గౌను అక్కకి! నీకు చాక్‌లెట్‌లు కొంటాగా..." అని నేను వారించాను. కాని అది దానియిష్టమైన గౌనే వాళ్ల అక్కకి కొనాలని మారాము చేసింది. "ఇదెక్కడగోలే! మీ అక్క తొడుక్కుంటుందా? నువ్వు తొడుక్కుంటావా?" అని వాళ్ల నాన్నగారు విసుక్కున్నారు. పాప వెంటనే "అక్కయ్యేమో తొడుక్కుని చిన్నదైపోతే నాకేగాదేమిటి యిచ్చేది. అప్పుడు నాకు బాగోవద్దా?" అని మమ్మల్ని నిలదీసింది. పసిదాని యీ 'లాజిక్' షాపు అతనికి కూడా నచ్చింది. "ఆ పాపనే సెలక్టు చేయనివ్వండి" అన్నాడు... ఇంకనేం ఏం అంటాం?...

శ్రీమతి ఎం.ఎస్. రావు, మద్రాసు. ★

## రొట్టె ముక్కలతో రకాలు

ఒక ప్లేటులో పాలుపోసి కొంచెం పంచదార వేసి "బ్రెడ్‌స్లైస్"లను ఆ పాలల్లో తడపాలి. పెనముపై డాల్డాతోకాని, నెయ్యితో కాని దోరగ యీ ముక్కల్ని వేగనివ్వాలి. ఎక్కువసేపు పాలల్లో నాననివ్వకూడదు. ఇవి తాజాగా తింటానికి ఎంతో బాగుంటాయి.

### స్వీట్‌బ్రెడ్

మొదట పంచదారతో తీగపాకాన్ని తయారుచేసి ఉంచుకోవాలి. బ్రెడ్‌స్లైస్‌లను డాల్డాలో వేయించి పాకంలోవేయాలి. ఇవి రెండు మూడు రోజుల వరకు చెడిపోకుండా ఉంటాయి.

### "సాటిస్"

బ్రెడ్ స్లైస్‌లు (నాలుగు) బంగాళ దుంపలు ఒకపావు, సూనె చాలినంత, ఉప్పు, పచ్చిమిరపకాయలు, ఇష్టమైతే కొత్తిమెర కూడా వాడవచ్చు.

ముందుగా రొట్టె నీళ్లలో నానబెట్టి ఉంచుకోవాలి. బ్రెడ్ చుట్టూ ఎర్రని, కాలి ఉండే భాగాన్ని తీసి వేయటం మంచిది. బంగాళ దుంపలను ఉడకనిచ్చి పొట్టు తీసివేసి వేయాలి. అందులో ఉప్పు, పచ్చిమిరప కాయలు, కొత్తిమెర నానబెట్టిన స్లైస్ అన్నీ బాగా మెత్తగా కలిపి ఉంచుకోవాలి. ఈ మెత్తని పిండిలాంటి పదార్థాన్నిముద్దలు, ముద్దలుగా తీసుకొని వడలువలె చేసి పెనముపై నూనెతో వేయించవచ్చు లేదా బాణలిలో నూనెలోనైనా వేసి తీయవచ్చు.

బాణలిలోని నూనెలో వేయిస్తే దాన్ని బ్రెడ్ "కట్‌లెట్" అంటారు.

వాణి (పంద్యాల)

## అ వీ — ఇ వీ — అ న్నీ

### హస్త సాముద్రిక సర్వస్వం

శ్రీ 'శార్వరి' సముగ్రంగా పామిస్ట్రీ గురించి రాసిన యీ సర్వస్వంలో 263 పుటలున్నాయి. సచిత్ర వివరణ వున్నది. వెల: పది రూపాయలు. ప్రతులకు శార్వరి ప్రచురణలు, 68, అమ్మాల్ కోయిల్ వీధి, మద్రాస్—24.

### దివ్య ఖురాన్

దివ్య ఖురాన్‌లోని 78వ అధ్యాయం (అన్—నబా) తెనుగు అనువాదం, వ్యాఖ్యానం. ఆంధ్రీకరణం: షేక్ హమీదుల్లా షరీఫ్. వెల 60 పైసలు ప్రకాశకులు: తెలుగు పబ్లికేషన్స్, జమాఅతే ఇస్లామీ హింద్, పామర్రు, కృష్ణాజిల్లా. ఆం.ప్ర.



